# ఉపోద్ఘాతము.

"పండ్రెండు రాజులకథలు" ప్రతి భారత గృహమందును వంశపారంపర్యముగాఁ జెప్పుకొనబడుచున్న విషయమెల్లరు నెఱింగినదే. ప్రస్తుతము విక్రయింపఁబడుచున్న గ్రంథములలోని కథలలోఁ జాల నసందర్భములుండుటచే నవి యంతగా సర్వజన సమాదరణీయముగ నుండుట లేదని గ్రహించి, చిరకాలమునుండి వివిధగ్రంథముల పరిశీలించి, పెద్దలవలన నాలకించి సందర్భానుసారముగా సాంఖ్యాసూత్ర ఛాయాపురుషాది వేదాంత రహస్యములఁ జర్చించి వ్రాసి నేఁటికి ప్రచురించినాను. ఇందలి దోషములు విజ్ఞులెఱింగించినచో ద్వితీయ ముద్రణమున సవరించుకొందును.

రాజమండ్రి.
4—9—32.

ఇట్లు విధేయుడు,
గ్రంథకర్త.

# విషయానుక్రమణిక.







ఓం

అవిఘ్నమస్తు.

శ్రీకృష్ణబోధామృతమను

# పంద్రెండురాజులకథలు.

శ్రీమదఖిలాండకోటి బ్రహ్మాండనాయకుండును, సకలాగమవేదియు, లీలామానుష విగ్రహుండును, నప్రమేయ ప్రభావభావనాతీతుండును, పీతాంబరధారియు, నాదిమధ్యాంత రహితుండును, యోగిజన దర్శన సులభుండును, కరివరదుండును నగు శ్రీకృష్ణపరమాత్మ ద్వారకాపురిలో రాధా సత్యభామా రుక్మిణ్యాది సతీమణులచే సేవింపఁబడుచు, తుంబుర నారదాది గానకళానిధులచేఁ గీర్తింపఁబడుచు నానందముగఁ గాలము గడపుచుండఁగా నొకనాఁడా యదుభూషణుని జననీ జనకులగు దేవకీ వసుదేవులు తనయుని జేరంజీరి, "కృష్ణా! నీసోదరి సుభద్ర క్షేమసమాచారములు పెక్కుదినములనుండి తెలియకున్నవి. నీబావమఱఁది పాండవమధ్యముఁడైన నీదర్శనమున కేతేరఁడాయెఁ గావున నీవొకపరి సపరివారంబుగ నరిగి విదుషీమణియైన కుంతికిని ద్రుపదనందనకును గానుకలొసంగి, చెల్లెలి నేమఱసి రమ్మని పలికిరి.

శ్రీకృష్ణుఁడు మందస్మిత వదనారవిందుండై తలిదండ్రులతో నట్లనే పోయివత్తునని పలికి ప్రేమైకమూర్తులగు నిజసతీమణులతోఁ ద్వరలో వచ్చెదనని వచించి, రథగజతురగాది వాహనములతోడను, జీనిచీనాంబరములను, దేదీప్యమానములై వెలుంగు రత్నాభరణములను దనతోఁ గైకొని సపరివారుఁడై యింద్రప్రస్థనగరమునకుఁ బయనంబయ్యెను.

వాసుదేవుని రాకను చారులవలన నెఱింగి యుధిష్ఠిరుండు భ్రాతలతో నెదురేగి కుశలంబారసి నిజసౌధంబునకుఁ దోడ్తెచ్చి, యర్ఘ్యపాద్యముల గౌరవించి, సుఖాసనాసీనుంగావించి, "పురుషోత్తమా! నీరాక మాకమందానంద సంధాయకంబైన" దనియెను.

గోపాలకృష్ణుండంత దాఁగొనివచ్చిన వస్త్రాభరణములను కుంతీ ద్రౌపదీ సుభద్రాదేవులకుఁ గానుకగా నొసంగి, వారి మన్ననలకు బాత్రుఁడయ్యెను. ధర్మరాజు నాతని సోదరులును శ్రీకృష్ణునిచే గీతా రహస్యముల ననుదినము తెలిసికొని ప్రహృష్ట మానసులగుచుండిరి. ఒకనాఁడు సుభద్రా మనోవల్లభుఁడగు నర్జునుండు ద్రౌపదీ మానసం రక్షకుండును నారాయణావతారుండును నగు గోవిందుం జూచి, "బావా! వసంతఋతుకాలమున మన మిర్వురము యమునానది పరిసరంబుననున్న గిరులందు విహరించివచ్చుట మదీయాభిమతం"బని పలుక, వసుదేవనందనుఁడు సమ్మతించెను.

అంత నయ్యిరువురును దమ ప్రయాణంబునకుఁ దగిన యాహార వస్త్ర సామగ్రినిఁ గొలఁదిమంది పరివారమును గొని యుత్తమ హయారూఢులై భయంకర మృగసంకులంబులగు వనాంతరంబుల నదనుఁజిక్కినపుఁడు వేఁటాడుచు, శుకపిక శారికా కలకిలారావములకు నానందింపుచు మధుర ఫలముల నారగించుచు సెలయేళ్ళలోని స్వచ్ఛ జలంబుల గ్రోలుచు మల్లె జాజి మొదలగు పుష్పలతల నవసౌరభము నాఘ్రాణించుచు యమునానదీతీరముం జేరిరి.

నాఁటి రాత్రింబున సుధాంశుఁడు గగనమండలమున నత్యంత తేజోవంతుఁడై వెలుంగుచు లోకమును దన శీతమయూఖములచేఁ జల్లఁ గాఁజేసెను. యమునాస్రవంతీ తరంగ మంజులగానము నాకర్ణించుచు, సికతతిన్నెపైఁ గూర్చుండి కృష్ణార్జునులు సరససల్లాపములాడుకొనుచున్నతఱిఁ బాండవమధ్యముఁడు వాసుదేవున కిట్లనియె.

బావా! నాహృదయమిప్పుడు నిశ్చలముగను నిర్వికారముగ నున్నది. చిరకాలమునుండి నీవలనఁగొన్ని వేదాంతరహస్యముల నెఱింగి తరింప వాంఛించుచున్ననాకు సమయము లభించినది ప్రశాంతము గానున్న యీవేళ, దేవమానవులు పునర్జన్మ రాహిత్యము నొందిమోక్షము నెట్లుపొందుదురో తెలుపఁగోరెద." యనుకులభూషణుఁడానంద వికసిత వదనాంబురుహుఁడై బావా! ఏమిది? నీపలుకులు నాకత్యంతాశ్చర్య జనకములుగానున్నవి ఎప్పుడును నీనోట యనవసరముగూర్చిన భాషణముల నాలకింపలేదు తొల్లినీవునరుండవును, నేను నారాయణుండనై యుంటంజేసి, నీకు మోక్షమార్గంబు విషయమై స్ఫురించినది. తత్త్వయోగజ్ఞానులగు మహాత్ములకే విదేహులై వల్యమనంబను మోక్షము సుసాధ్యము. వివిధనామములతో విగ్రహారాధన మొనరించుట వలనంగాని యంత్ర మంత్ర తంత్ర జపములవలనగాని మోక్షము సిద్ధింపనేరదు. తొల్లి వ్యాసవాల్మీకాంబరీషాగస్త్యాది మహర్షులు వేదాంతరహస్యముల నెఱింగియే మోక్షసామ్రాజ్యమును జేరగలిగిరి. సాకార బ్రహ్మమగు సద్గురుస్వామి కర్చనవందనము పూజగావించి, నిరాకార బ్రహ్మమును ధ్యానించిన మోక్షము కరతలామలకమగు" ననియెను.

"స్వామీ! కృష్ణపరమాత్మా! ఈవేదాంత రహస్య విధానముల నాకుఁ దెలిపి, కృతార్థుం జేయవే" యని ప్రశ్నింప, నావస్నగళయుతుం డిట్లని వాక్రుచ్చె.

"అర్జునా! వేదాంతసారము పండ్రెండు విధంబులు. సాంఖ్యసూత్రము, ఛాయాపురుష లక్షణము, నాదానందభావము, పంచముద్రాభావము, తారకమంత్రప్రభావము, సచ్చిదానంద లక్షణము, ఆకార నిరాకారభావము, అవానస్కము, దర్పకభావము, మౌళిక ప్రకారము, అచలపరిపూర్ణము ననునవి ఈమార్గముల ననుసరించి, నడచుకొనువానికి విదేహకైవల్యము సులభముగ సిద్ధించును. గురుముఖంబున నొక్కొక విషయమైన బోధింపబడి, పుణ్యపదమందిన మహాత్ములగు రాజుల చరిత్రములం దెలిపెద నాకర్ణింపుము. మొదటిదగు సాంఖ్యసూత్రము ననుసరించిన జగత్సింహ మహారాజుకథను దెలిపెద నాకర్ణింపుము.



# జగత్సింహమహారాజు కథ



తొల్లి కేరలదేశమును బాలించుచుండిన వీరసేనమహారాజునకు లోకోత్తర సౌందర్యలావణ్య విరాజితయని ఖ్యాతిగాంచిన శశి రేఖ యను భార్యవలన చిరకాలమునకు జగత్సింహుండను పుత్రుండు జన్మించెను.

వీరసేన మహారాజు లేక లేక కలిగిన యాపుత్రునత్యధిక గారాబముతో, బెంచుచు, సకల శాస్త్రపారంగతునిగను, ధనుర్విద్యాకుశలునిగను, సమర కౌశలయుక్తునిగను జేసెను. ఆ రాజపుత్రుడు నకంతట లోకసంచారము చేయవలయునను కోరికజనించెను. జనకునితో జెప్పినచో బయలుదేఱుట కంగీకరింపడని తలంచి యొకనాడు మూసుండు వలయుంబ్రయాణ సామగ్రిం గైకొని, ... రాత్రింబున నుత్తమతురంగము నారోహించి, పయనంబయ్యెను.

తెల్లవాఱినపిదప వీరసేన మహారాజు శశిరేఖాదేవియును కుమారుని గానక, మిక్కిలి పరితపించి నల్దెసలకుం జారకులం బంపిరి. ఒక్కండైనను రాకొమారుని జాడ దెలుపం జాలకపోయెను.

ఇట జగత్సింహుండు ఘూకసూకర హర్యక్ష శరాళ వ్యాఘ్రాది కౄరమృగ సమన్వితమగు నరణ్యంబులను, పర్వతోపత్యకలను, గిరికందరములను దాటిపోవుచు, సరోవర జలంబులం గ్రోలుచు, మూలఖర్జూరాది ఫలంబుల నారగించుచు ప్రకృతిరామణీయకతంబరిశీలించి, యానందింపుచు నేగి యేగి యొక నగరమును సమీపించి, నవపారభంబు వెదజల్లు వృక్షంబులతో నిండియున్న యొక యుద్యానవనంబును జూచెను.

ఆవనములోనుండి వచ్చుచెంచు సుగంధమిళిత మలయమారుతము మేనుసోక, హాయిఁజెంది, జగత్సింహరాజకుమారుఁడు తన హయముతో నావనములోనికి లంఘించెను.

ఆయుపవనంబున నశ్వము నొక తరువునకుం గట్టివైచి యా రాజనందనుఁ డయ్యారామములోని పుష్పలతలను, ఫలవృక్షంబుల నేత్రోత్సవంబుగఁ గాంచుచు "ఈవనమేరాజునకోఁ జెందియుండ వలె" నని మనంబున తలపోసి, యావనములోని సరస్సుదరికరిగి, నిర్మల జలంబులఁ ద్రావి, యొక చంద్రకాంత శిలావేదికపై విశ్రమించెను.

ఇంతలోఁ గొందఱు యువతీమణు లత్యంత మనోహరములగు పాటలను సుమధురకర కంఠస్వరమున బాడుచు నట కరుదెంచుట గమనించి, జగత్సింహుఁడు "ఓహో! ఈతరుణీమణు లిచ్చోట జలక్రీడలు సలుపవచ్చుచుండిరి కాఁబోలు. అలసి సొలసియున్న నేనెందేగుదును. ఈమహోన్నత వృక్షశాఖాగ్రంబునఁ గూర్చుండి వీరి యాటపాటల నరసెదగాక" యని తలంచి, గుబురుగానున్న యొక చెట్టుకొమ్మపైఁ గూర్చుండెను.

ఆ కామినులంత నరుదెంచి, యాసరోవరతీరంబున గూర్చుండి, మోదములు చిగుర్చునట్లు తమ కంఠములెత్తి లోకమోహనకరముగఁ బాడిరి. ఆనారీమణుల సమూహములో నొక యువతి యందత్రికంబు విలువైన దుస్తులధరించి, సౌందర్యరాశి యననొప్పుచుండెను. ఆమె యాకార ప్రకారాదులనుబట్టి, రాజకుమార్తెయై యుండునని గ్రహించి జగత్సింహుఁ డామె చక్కదనమున కక్కజంబొది కామవికార మునకులోనై ఈమెను పెండ్లిచేసికొననిజన్మ వ్యర్థమని తలంచి మరల 'చక్కనా! నే నీమెకొరకు పాలబడి తేనియలాగు దూవికారమునందెచ్చి

పెట్టుకొంటి నీమె నాపాలముగా నున్నచో నామనం బ్రాణములు నిల్చుట కల్లయని తలంచి యీమెధరించిన వలువలం గ్రహించియైన మానసము నూఱడించుకొందమని యెంచి తన బాణమున నమ్ములు సంధించి యాతూణీరముల చేతనే రజ్జువుగావించి సరస్తీరముననున్న యాచీరను రైకలను హరించి తనయొద్దనుంచుకొనెను.

రాజకొమరిత తోడిచెలికత్తెలతో తీరమునకేతెంచి తన దుస్తులులేకుండుటకును, బాణముచే భూమి లోనైన యాఘాతమునకును నాశ్చర్యమునొంది కలవరపడి చెలికత్తెచే నంతఃపురమునుండి చీరను దెప్పించుకొని లోనికేగి తనతలిదండ్రుల కివ్విషయము నెఱింగించెను. జగత్సింహుఁ డాయుపవనమునుండి వెడలిపోయెను. రాజు కుమార్తెతో నావిషయము విచారింతునని పలికి మంత్రియగు సుశర్మతో నాయుపవనంబునకరిగి యాప్రదేశముం బరీక్షించెను. సుశర్మ రాజునుద్దేశించి "ప్రభూ! ఎవరో రాజకుమారుఁడు తమపుత్రికారత్నము సఖీజనపరివృతయై కొలనుకరుదెంచి జలకమాడుటకై వస్త్రములు తీరముననుంచుట గమనించిన యేరాజపుత్రుఁడో తనయస్త్రవిద్యాకౌశలమున బాణములచే రజ్జువుంగావించి యామె చీరలఁగొనియుండు"నని పలికెను.

అంతనాజయద్రథమహారాజు తనకుమార్తెను జేరంజీరి, మంత్రి చెప్పిన విషయముం దెలుప, నామె "తండ్రీ! నేను స్నానమొనరించు నప్పుడా రాజకుమారుఁడు నాయవయవములను గాంచి యుండును. అట్టియెడ నేను మఱొకరాజకుమారుని ప్రేమింపఁజాలను. నాకా రాకొమరునట్లయిన వివాహము చేయుఁడన్యుల నేనొల్ల" నని పలికెను. రాజంతట వల్లెయని, మంత్రితోఁ దన కుమార్తె దృఢమనోనిశ్చయముం దెలిపి, యెట్లయిన నారాకొమరుని దోడితేవలయునని చెప్పగా నామంత్రిసత్తముఁడగు సుశర్మ ప్రయాణసన్నద్ధుండై వెడలెను.

ఇచట నాజగత్సింహుఁడు వన్యమృగారావములచేఁ బ్రతిధ్వనించు సాంద్రారణ్యములను గడచి పోవుచుండెను. అతని చిత్తము మాత్ర మామత్తకాశినిపై హత్తియుండెను. అతని కేది దృగ్గోచరమైనను నా రాజకుమార్తెవలెనే తోఁచుచుండును. అతఁడు పోయిపోయి భరద్వాజ మహర్షి యాశ్రమము సమీపించెను. భరద్వాజమహర్షి శిష్యులు ఖిన్నులై యున్న యా రాజనందనునిం గాంచి, యాతని నామహర్షి చెంతకుఁ దోడ్కొని పోయిరి.

భరద్వాజమహర్షి జగత్సింహుని కన్గొని "రాకుమారా! నీవదనము న[illegible]ంగియుండుటకు హేతువేమి?" యని ప్రశ్నింప నా రాకుమారుఁడు తాను జయద్రథమహారాజకుమార్తె మందారమాలను గాంచి మోహాకారవశతఁ జెందిన యుదంతము నెఱిఁగింప నామునిపుంగవుం డిట్లనియె.

"[illegible] నీవిఁకను సంసారసాగరమను మాయాజాలంబున జి[illegible]గదా! కష్టము! కామమెంతగర్హ్యమైనది? తుచ్ఛమగు [illegible]మునంతయు సుఖమున కాశించి యింద్రాదిదేవతలే నిరర్థక[illegible] [illegible]మాట నెఱింగిన నీవట్లొనర్చుట పాడియగునా? సంసార [illegible] శాంతినిపొందుము. నీకేను శబ్దభేదియను మహామంత్రము [illegible]నని పలికిన జగత్సింహకుమారుం డాశ్చర్యచకితుండై యా [illegible]పాదములకెఱఁగి "నేను ధన్యుఁడనైతి"ననెను.

భరద్వాజమహర్షి యారాజపుత్రునకు అష్టాక్షరీమంత్రము, మం[illegible] మంత్రమూలమంత్రసారములను బోధించి ఎనిమిదిమంత్రా[illegible]ములను కమలసప్తకమునందును నాదబ్రహ్మమునందునునిలిపి ఆ [illegible]బులను వర్ణించి తదధిదేవతను వివరించి "కుమారా! నీవు కృతార్థుఁడవైతివి. మానసపీఠమును మంత్రపీఠముగా నొనరించితివి. ఈమంత్రము మహామహిమోపేతంబైనది. నీవును దీనిం బారాయణ

మొనరించి పుణ్యలోకములొందగలవు. తొలుత సద్వయబ్రహ్మమునం దాకసము ఆకాశమునుండి వాయువును దానివలన నగ్నియును నగ్నివలన జలమును జలమువలన భూమియుఁ గలిగినవి. ఆకాశమునకు బ్రహ్మతోడి సంబంధమువలన జ్ఞానమును వాయువునకు నాకాశము సంబంధము కల్గుటచేత హృదయమును అగ్నియు నాకాశము కలియుట వలన బుద్ధియును జలాకాశసంబంధమువలన చిత్తమును భూమ్యాకాశసంయోగమువలన నహంకారమును నావిర్భవించినవి. ఇవి గగనమునకు సంబంధము కలిగినవై యంతరింద్రియములనాఁబడును. ఇఁక ప్రాణేంద్రియములు ప్రాణాపానవ్యానోదాన సమానములను నైదునై యున్నవి. అగ్నిసంబంధములగు జ్ఞానేంద్రియములు శ్రోత్ర త్వక్కు చక్షు జిహ్వా అఘ్రాణములను నైదునై యున్నవి. ఇఁక నుదకమును సంబంధించి శబ్దస్పర్శరూపరసగంధములున్నవి. వాక్కు, పాణి, పాద, గుహ్య వాయువులైదును భూమికి సంబంధించిన కర్మేంద్రియములై యున్నవి. మొత్తమీయిరువదియైదునుగలిసి శరీరముగా వెలయుచున్నవి.

| | | | | |
|---|---|---|---|---|
| జ్ఞాత | మనస్సు | బుద్ధి | చిత్తము | అహంకారము |
| సమానము | వ్యానము | ఉదానము | ప్రాణము | అపానము |
| శ్రోత్రము | త్వక్కు | చక్షువు | జిహ్వ | ఘ్రాణము |
| శబ్దము | స్పర్శము | రూపము | రసము | గంధము |
| వాక్కు | పాణి | పాదము | గుహ్యము | వాయువు |

జ్ఞాతసమానశ్రోత్ర శబ్ద వాక్కు లైదును నాకాశపంచకమనియు, మనోవ్యానత్వక స్పర్శపాణు లైదును వాయుపంచకమనియు, బుద్ధి, ఉదాన, చక్షు రూప పాదము లగ్నిపంచకమనియు, చిత్త ప్రాణ, జిహ్వా, రస గుహ్యము లైదును నుదకపంచకమనియు, నహంకార, అపాన, ఘ్రాణ, గంధ వాయువులైదును భూపంచకమనియు ననఁబడును.

శ్రోత్రి మను దానికి విషయము శబ్దముగను, దిక్కు అధిదేవత గను, త్వక్కునకు రూపమును, సూర్యుం డధిదేవతగను, జిహ్వాకు విషయము రసము, వరుణుండధిదేవతగను వెలయుచున్నవి.

వాక్కునకు వచనము విషయముగను అధిదేవత అగ్నిదేముండు ను, పాణికి దానము విషయముగను అధిదేవత విష్ణుదేవుడు, గుహ్య ముున కానందము విషయము బ్రహ్మదేవతయు, వాయువునకు విసర్జ నము విషయముగను, అధిదేవత మృత్యువునునై వెలయుచున్నవి.

నాభిలో సమానవాయువును, ముసస్సున పాణవాయువును, గుదమునందపానవాయువును, కంఠమునందు దానవాయువును, శరీరము నందంతటను వ్యానవాయువును నుండుటయే గాక నాగ, కూర్మ, కృ కర, దేవదత్త ధనంజయంబులనునై దుపవాయువులు కాయమునం దంతటను నిండియుండును.

మఱియు కాలాగ్ని ఫాలమునందును. జఠరాగ్నికుక్షిలోను, శీ తాగ్న హృదయమందును, క్రోధాగ్ని నేత్రములందును జ్ఞానాగ్ని భ్రూమధ్యంబునందును గలిగియుంచి పంచాగ్నులునని చెప్పంబడును. ఈపంచాగ్నుల మధ్యమున నాత్మారాము డేకరూపుండై వెలుగొందు చుండును. మఱియు జాగరణ స్వప్న సుషుప్త్యవస్థలు మూడింటిలో మొదటిది హృదయమునను, కంఠమున స్వప్నమును, త్రికూటంబున సుషుప్తియునుండును ఈమూండవస్థలును గృహస్థాశ్రమ యోగకరంబు లును, తుర్యము తుర్యాతీతమునను రెండునుంగలిపి యోగీంద్రులకు నియమితంబులై యుండును. ఇంద్రియ సాంగత్యవిరహితమై నిర్మలమై యుండు సుషుప్త్యవస్థయే అవస్థలన్నింట శ్రేష్ఠంబని పెద్దలు నుడువు దురు. హృదయము పాణవాయువుతోనిండి రసము జిహ్వేంద్రియము ద్వారాగ్రహించి గుహ్యావస్థలు రెండును మదించుటచే శుక్ల శ్రో ణితములుప్పొంగి రెండును నొకటిగా యభివృద్ధినొంది పిండరూపంబు

కొంది సమానవాయు పరిపోషితములై వివిధావయవములు క్రమ క్ర మముగ నేర్పడ నవమాసములు మూత్రపురీష నిలయమైన గర్భము నుండి మూత్రద్వారమునఁ గడచి యీవలఁబడి మాతచే పోషింపంబడును. జనని శోణితంబెక్కువైన నెఱుపుగను, తండ్రి శోణితంబధికంబైన నల్లగాను రెండును సమానంబైనచో శ్యామలచాయగాను పుత్రులు జనన మొందుచుందురు. అట్టి హేయమగు నింద్రియంబున కాశించి నీవిట్లు విభ్రాంతుఁడవు కాఁగూడ'దని భరద్వాజమహర్షి జగత్సింహు నకు సాంఖ్య సూత్రమంత్రంబుల సాంగముగ నెఱిఁగించుటయేగాక శ బ్దభేదియను మహామంత్రమును గూడ నుపదేశించెను.

జగత్సింహరాకొమరుఁడు మానవజీవితాంతరార్థము గ్రహిం చినవాఁడై యాఋషికి శుశ్రూష చేయుచు, నత్యంతనిగూఢంబులగు వేదాంత రహస్యములం దెలిసికొనుచుండెను.

ఇట్లు పలికిన శ్రీకృష్ణుని మాటల నాకర్ణించిన యర్జునుండు సంతుష్టాంతరంగుఁడై "బావా! గోవిందా! నీకృపాతిశయమున సాంఖ్య సూత్ర ధర్మముల నెఱింగితిని. జగత్సింహుఁ డేమయ్యెను? ఆరాజసుత మందారమాలగతి యేమయ్యె" నని యడుగ, నచ్యుతుం డిట్లనియె.

"అర్జునా! భరద్వాజమహర్షి యాశ్రమమునుండి యొకనాఁడు జగత్సింహుఁడు ఫలపుష్పములకై వనాంతర్భాగంబునకుంబోవఁ గొం దఱు బాటసారులు గోచరించిరి. "అయ్యా! మీ రెందేగుచున్నా"రని జగత్సింహరాజసూనుఁడు ప్రశ్నింప వారు "ఆర్యోత్తమా! మత్స్యదేశా ధీశుఁడైన కళింగవర్మమహారాజు తనపుత్రికయైన చిత్రరేఖ స్వయంవర మహోత్సవముఁ జూడఁబోవుచున్నాము. ఆరాజశేఖరుఁ డొక శారికా యంత్రము నేర్పఱిచినాఁడు. ఆయంత్రమునకు గట్టబడిన మత్స్యమును క్రిందనుంచిన యద్దంబునందు గుఱిచూచి కొట్టినవారికి తనకుమా ర్తెనిత్తునని ప్రకటించినా"డని చెప్పగా జగత్సింహుఁడు ఋషియొద్దకు

బిరబిరనరిగి "మునీంద్రా! మత్స్యదేశంబునకుఁబోయివత్తు"నని చెప్ప వాఋషీశ్వరుఁడు "శుభంబగుఁగాక" యని యాశీర్వదించి యంపెను.

జగత్సింహుఁడు నిజహయారూఢుండై మత్స్యదేశాభిముఖంబుగ పోవుచుండగ దేశదేశంబుల నాతని నన్వేషించుచున్న జయద్రథ మహారాజు మంత్రిసుశర్మ కనిపించెను. కృశించి జీర్ణవసనధారియై యున్న యారాజసూనుఁడే మందారమాలకంచుకములను గ్రహించినవాఁడై యుండునని యూహించి నిజచరిత్రమాతనినుండియే నేదేని యుక్తింబన్ని తెలియవలెనని యెంచి యాతనితో వివిధవిషయములం గూర్చి ముచ్చటించుచు రాజకుమారా! ఈవనసౌందర్యము నెంతని వర్ణింపఁగల"మనిపలుక నారాజనందను "డోయీ! ఈయరణ్య రామణీయకమునకే యింతగా నబ్బురపడుచుంటివే? విదర్భదేశపు మహారాజయిన జయద్రథరాజేంద్రుని కుమార్తెయుద్యానవన రామణీయకత కొందును సరిపోల"దని చెప్పెను. సుశర్మ నిజముగా నాతఁడే మందార మాలం దాఁచియుండునని నిశ్చయించుకొని మఱికొంత దవ్వేగినపిదప నొకసరోవరము కనబడగ నామంత్రి "ఆహా! ఈకొలనుశోభ వర్ణనాతీతమని పలుక నారాజపుత్రుఁడు "ఓయీ! నీవీప్రపంచమున విచిత్రములైనవానిని వేటినిజూచియుండవు. విదర్భదేశాధీశుని కొమరితయుపవనమునందలి సరస్సునుజూచితివా యిక నచ్చోటినుండి విడిచిరా"వని చెప్పగా నామంత్రి "అయ్యా! ఆరాజపుత్రి యుపవనంబు నెట్లు చూచితి"రని ప్రశ్నింప నాతఁడు జరిగినదంతయుఁ జెప్పెను.

మంత్రిమఱల "నయ్యా! అంతటిసౌందర్యవతియైన రాకొమరితను జలకమాడుచుండ కనులారగాంచి యొక్కపలుకైనా నాడక యీవలికివచ్చిన మీమనోదార్ఢ్యమెంతయుఁ బ్రశంసాపాత్రము ఆసౌందర్యమూర్తిని విడిచివచ్చుటకు మీమనస్సెట్లు తృప్తినొందిన"దని యడుగ నాజగత్సింహుఁడు తనకడనున్న మూటవిప్పి యామె చీరనురైకను

జూచి "అయ్యా! ఆరాకొమరిత సౌందర్యమునకేను విమోహితుండ గానరా
నై ఉన్మాదుడనైపోతి" నని వచించగా కనులనుండి జలజలమని దుఃఖా రాత్రియుం
శ్రుబిందువులు రాలెను.

అంత సుశర్మ యా రాకొమారు నుద్దేశించి, "అయ్యా! విచారింపకుము. మా విదర్భదేశపు రాజనందన మందారమాలనే నీవు చూచి మోహవివశుఁడవై తివి. నీవా నాఁ డుద్యానవనమునుండి వెడలిపోయిన పిదప నామెలనాగ తన చెలిదండ్రులకు [illegible] తెలుపగా వారందు నిన్ను వెదకుటకై నన్నంపినారు. [illegible] నిద్రాహారములమాని నిన్ను వెదకుచు నేటికి [illegible] రాకుమారా! రమ్ము. వచ్చి మా మందారమాలను బెండ్లాడి సుఖింపుము" అనెను. జగత్సింహుఁ డానందబాష్పాకులనయనుఁడై "అయ్యా! మంత్రిసత్తమా! మత్స్యదేశాధినాథుండగు కళింగవర్మ కుమార్తె చిత్రరేఖ వివాహమహోత్సవమునకే నరుగుచున్నాను. అచ్చట శౌరికాయంత్రాద్భుతముం దిలకించి, మగుడి మీ దేశమున కరుగుద" మన సుశర్మ "నరేంద్రనందనా! నామనవి నాలకింపుము. మా రాజపుత్రినే పట్టంపుదేవిం జేయవలయు" ననుటయు [illegible] సానందం గీకరించెను.

జగత్సింహ సుశర్మలు సరససల్లాప నిమగ్నులై హయముల బరువెత్తించుచు మత్స్యదేశముం జేరిరి. మఱునాఁడే స్వయంవరమగుట నానగరము వివిధదేశాధిపులగు రాజులతోడను నానా గజతురంగ పదాతి పరివారవర్గముతోడను నిండి నేత్రోత్సవముగ నుండెను. స్వయంవర సభామంటపము చక్కఁగా నలంకరింపఁబడి, రాజుల కిరీటములందలి రత్నకాంతులతో ధగద్ధగాయమానముగఁ బ్రకాశించుచుండెను. కళింగవర్మ తన కుమార్తెను జూపి, "రాజశ్రేష్ఠులారా! ఈశౌరికాయంత్రముక్రింద నమర్పఁబడియున్న యద్దములో, యంత్ర

బిరబిరనదిగి "
...బడిన మత్స్య ప్రతిబింబము నాలోకించి, లక్ష్యము
భేదించువానికి నాతనయనిచ్చి పరిణయము గావింతు" నని, కూ
య్యుండెను.

రాజులెల్లరును నామహాయంత్రమును దేటిపారిజూడఁజాలక "అహా! ఇది మాకశక్తి నిమించిన విషయ"మని, విన్నదనమున మిన్న కుండిరి. జగత్సింహుఁడు యంత్రమును సమీపించి, దిక్కులు పిక్క టిలునట్లు ధనుష్టంకారముం జేసి వింట నమ్ములు సంధించి, భరద్వాజ మహర్షిం దలంచుకొని శరము విడుచునరి కది తిప్పునసేగి యాలక్ష్య మును భేదించెను. దేవతలు దుందుభులు మ్రోయించిరి. రాజులెల్లరు నాశ్చర్యమగ్నమానసులైరి. కళింగవర్మ జగత్సింహుని విలువిద్యా కౌశలమును శ్లాఘించి, మహావైభవమున కుమార్తెనిచ్చి పరిణయ ముగావించెను.

అయిదవనాఁటి రాత్రి జగత్సింహుఁడు చిత్రరేఖతో మందార మాల విషయముం దెల్పి, "నీవు నారెండవభార్య"వని మఱునాఁడు మామగారొసఁగిన యమూల్య బహుమానములంగొని భార్యాసహి తుఁడై విదర్భదేశాధినాథుండగు జయద్రథమహారాజు నగరికి సుశర్మ తోఁ బయనంబయ్యెను.

చారునివలన సుశర్మ జగత్సింహు లరుదెంచుచున్నారని విని జయద్రథుఁడు పురము నత్యంతమనోహరముగ నలంకరించెను. ఆరా జు జగత్సింహసుశర్మలను ఎదుర్కొని గౌరవించి నగరునకుఁగొంపో యెను. చిత్రరేఖ మందారమాలచెంతకంపబడెను. శుభముహూర్త మున మందారమాలాజగత్సింహుల వివాహముజరిగెను.

అట గొన్నాళ్ళుండి జయద్రథుఁ డొసంగిన కానుకలతో జగ త్సింహుఁడు మందారమాలా చిత్రరేఖలతు దోడ్కొని సపరివారము గ కేరళదేశమున కరిగెను. వీరసేనమహారాజును నళినీదేవియు కుమా

రుని కన్గొని యత్యధికానందభరితాత్ములై "నాయనా! నీవింక గానరా మముఁదెలుపు"మన నాతఁడు మందారమాలాచరిత్రశేషంబుఁ జెప్పియుఁ

అంత శుభదినంబున వీరసేనమహారాజు కుమారునకు బట్టాభిషేకాదికట్టెను. జగత్సింహుఁడు వివిధదేశముల జయించి రాజ్యంబును సుస్థిరత మొనరించి ప్రజానురంజకముగఁ బాలించి యనంతరమున విష్ణుసాన్నిధ్యమునొందెనని కథముగింపగా నగ్రజుఁడు "బావా! దామోదరా! నాకు నిద్రవచ్చుచున్నది. రేపు మఱియొక విషయమై ప్రసంగింత"మనియెను.

వా రానాఁటి రాయిసుకతిన్నెపై నిద్రించిరి.

మొదటికథ సమాప్తము.



బిరబిరనరి

వాఖ్యా కథ చెదించ

## రెండవకథ.

రెండవనాఁటిరాత్రి శ్రీకృష్ణార్జునులు యమునాపై కలస్థలులం హర్షుండై, తాంబూల చర్వణముగావించుకొనుచు సరససల్లాపముల నాడుకొనుచుండ, అంత నర్జునుండు "బావా! వేదాంతరహస్యములలో ... మహాపురుషలక్షణము నెఱింగించి, నన్నుం గృతార్థుం జేయు"మనఁ ... హాస చంద్రికా వికసిత వదనారవిందుఁడై, దా మోదరుండి ట్లనియె.

... నీకు వీరప్రతాపమహారాజు కథను దెలిపెద నాకర్ణింపుము.

## ...ప్రతాప మహారాజు కథ.



... దేశమును దిలీపమహారాజు ప్రజలం గన్నబిడ్డల భాతిం బరిపాలించుచున్నతఱి నాతని కుమారుండగు వీరప్రతాపుఁడు ధనుర్విద్యా ... సకలశాస్త్ర పారంగతుఁడై విరాజిల్లుచుం డెను. అతనికి మతిమంతుఁడను మంత్రికుమారుం డెల్లవేళల తోడు నీడయై మెలఁగుచుండెను. ఒకనాఁటిరాత్రి యా రాజకుమారుఁడగు వీరప్రతాపుండును, మంత్రినందనుఁడగు మతిమంతుఁడును దేశసంచా రము చేయు తలంపు కలుగగా, ప్రయాణసన్నద్ధులై రెండు ఉత్తమా శ్వముల నారోహించి వెడలిపోయిరి.

ఉదయమున రాజపుత్రుడును, మంత్రితనయుఁడును గానరాకుండుటచేఁ బురమున కల్లోలముదయించెను. రాజును మంత్రియుఁ దమకుమారుల వెదక చారులఁ బంపిరి.

ఇట వీరప్రతాపమతిమంతు లిరువురును వ్యాఘ్రభల్లూకాది వన్యమృగ ఘోషలచేఁ బ్రజ్వరించు భయంకరాటవులందు నిర్భయముగ గుర్రమ్మురుచు ననేకగ్రామములఁదాటి వింధ్యపర్వతమును సమీపించిరి. అంత వీరప్రతాపునకు దాహము విశేషముగా కాఁగా నాతఁడు మంత్రిపుత్రుంజూచి "మిత్రమా! పిపాసమధికముగానున్నది. నేనింక నడువఁజాలను. ఎందైనను వెదకి నీరంబుఁగొనివచ్చి నాప్రాణంబుల నిలుపుమా యనెను. మతిమంతుఁడు వెంటనే బయలుదేరి చాల దూరము నడచిపోయెను.

మతిమంతుడట్లు చాలదూరముఁబోవగా నొకబిలము కనిపించెను. రాజకుమారునకు జలంబుఁదీసికొనిపోవు తలంపుతో అన్యథా వంచేదియు లేని యామంత్రితనయుఁడు నిర్భయముగా నాబిలమునఁ బ్రవేశించెను. మృదుమందమారుతము వీచుటచే సమీపమునెక్కడో జలము లభ్యంబగునని యూహించెను. కొంతదూరము చనునప్పటికి పెద్ద వెలుగు కనంబడి మతిమంతు నాశ్చర్యాంబుధిమగ్నమానసునిగావించెను. ధైర్యముతో నాతం డావెలుగును సమీపింప నొకసుందరాంగి యాతనిని సమీపించి "ఓయీ! ఈదేవతావిహారస్థలమునకు నరుఁడవగు నీవెట్లురా సాహసించితి"వని జలమును మంత్రించి యాతనిపై జల్లగా నతఁడు మర్కటరూపము ధరించెను. కోతిరూపముందాల్చిన మంత్రికుమారు నాతరుణీమణి తోడ్కొనిపోయి తనకుఁగలవానరసమూహంబునఁ జేర్చెను.

ఇచ్చట వీరప్రతాపుఁ డెంతసేపటికిని మంత్రికుమారుఁడు రాకుండుటకు మిక్కిలి విచారించి, కష్టముతో మరలఁ బ్రయాణము

సాగించు నరి కనతిదూరములో నొక యామలకవృక్షము గోచరింపఁగా నాఫలముల భుజించి, దాహబాధ యుపశమనముఁ జేసికొని కొంత దూరము పోవునరి కొక నది కనిపించెను. ఆనదీ జలంబులఁ దనివితీరఁ గ్రోలిన వీరప్రతాపునకా ప్రవాహమున పెద్ద తలవెంట్రుక కనిపించెను. దానిం దీసి పరికింప, నయ్యది ఖండెత్రింశు మూరల పొడవు గలిగి నిగనిగలాడుచుండెను. "ఇంత నిడివిగల తలవెంట్రుక కలిగియున్న నారీమణి మానవలోకమున నుండుటరుదని గ్రహించిన యావీరప్రతాపుండా కేశముంగొని "తమ్ముఁడా! మతిమంతా!" యని ఎలుంగెత్తి కేకలిడుచు, పోయిపోయి భాస్కర మహాఋషి యాశ్రమముం జేరెను.

భాస్కరమహర్షి వీరప్రతాపుని యుదంతమాలకించి, ఖండెత్రిం శుమూరల నిడివిగల తలవెంట్రుకగల తన్వికథను, మతిమంతుని జాడలను దెలిసికొనుట యాతని యభిమతమై యున్నదని గ్రహించి, యిట్లనియె.

"దేవకాంతయగు ఉలూచిపేరు వినియుందువు. ఆఉలూచి యొకానొకప్పుడు భూలోకసంచారసందర్భమున మరుత్తుండను నృపాలుని గాంచి మోహావివశయై యాతనిని నపేక్షించెను. అతఁడును నామెను నూహించి వివాహమాడెను. ఉలూచి గర్భవతియై తొమ్మిదిమాసములలో ననంతకోటి సూర్యప్రభాసమానయగు నాఁడుశిశువునుగాంచెను. ఆశిశువుజన్మించినంతనె మరుద్రాజు 'నీశిశువునుసి పెంచుకొనుము' అని చెప్పి తనదేశమునకు వెడలిపోయెను.

ఉలూచి భూలోకమున నుండుట కవకాశములేని దేవకాంత యగుటచే నాకుమార్తెకు కీర్తిచంద్రికయని పేరిడి మువ్వురు చేడియల నుఁ గొలది పరివారమును నేర్పరచి యప్పుడప్పుడువచ్చి చూచుచుండె

ను. ఆకీర్తిచంద్రిక నవయౌవనోద్భాసితయై దిగంతవిశ్రాంతసౌందర్య విలసితయై లోకోత్తరలావణ్యవతియై వెలుగొందుచు యువకులఁ బెండ్లి యాడుట కంగీకరింపక యాబిలమును జొచ్చినవారి నందరను కోతులుగను, శునకములుగను జేయుచుండెను. ఆకీర్తిచంద్రిక స్నానము చేయునపుడు రాలిన శిరోజమేయిది. నీస్నేహితుఁడు గుణవంతుఁడొకవేళ యాబిలముఁజొచ్చి వానరరూపమును బొందియుండునని తలంతు" ననిపలుక వీరప్రతాపుఁడు వెంటనే మూర్ఛితుఁడై "మహర్షిచంద్రమా! త్రైలోక్యక్షోభితమగు కాలమున జన్మించి పిరికివానివలె నూరకుండుట పాడికాదు నేనువెళ్ళి నామిత్రుని విడిపింతునని చెప్పగా నా భాస్కరమహర్షి "వత్సా! తొందరపడెదవేల? నేఁజెప్పుదానిని సావధానముగా నాలకించి వెళ్ళుము. వేదాంతరహస్యమగు ఛాయాపురుష లక్షణము దెలిపెద" నాకర్ణింపుమని యిట్లు చెప్పెను.

"నకార ఓంకారంబును, బిందుయుక్తంబగు హకారంబును సోహంహంసాక్షరద్వయంబు జపించి సూర్యాభిముఖముగా నిలిచి, నీదేహచ్ఛాయనుజూచి, శీర్షాక్షరములుండు స్థానముపై దృష్టి స్థిరీకరింపఁజేసి అచంచలముగ మేఘములవంకఁ జూడుము. ఆమేఘమధ్యమున నీకు ఛాయాపురుషుఁడు దృగ్గోచరుఁడగును. ఆఛాయాపురుషునకు శిరమ్ము లేనిచో నారుమాసములకును, కరములు లోపించినచో మూఁడు మాసములకును, పాదములు లేకున్నచో నొక మాసమునకును మృతి సంభవించును. ఛాయ రక్తవర్ణముగనున్నచో సామ్రాజ్యాధిపత్యము కలుగును. పసుపువర్ణముం గల్గియున్నచో మహీమండలనాయకుం డగును. శ్వేతవర్ణయుక్తముగనున్నచో నవారోగ్యము, దారిద్ర్యము సంప్రాప్తంబగు" లని పలికి, ఛాయాపురుషుని జూడుమనెను.

నిశ్చల హృదయముతో వీరప్రతాపుఁడు భాస్కరమహర్షి యుపదేశించిన మంత్రమును జపించుచు, ఛాయాపురుషుని విలోకించి,

ఎఱుపు పసుపు వర్ణములు కలిసియున్నవని చెప్పగా నాఋషి "వత్సా! నీకు సకల శుభంబులును గలుగును. ఆబిలమునకేగి, నిన్ను 'ఎవరవు?' వని యడిగిన వారితో దేవదూతనని చెప్పి, 'కీర్తిచంద్రికా' యని గొంతెత్తి పిలిచినంతనే ఆమె వచ్చును. నీవామెను బరిణయమై రమ్ము 'అని చెప్పెను.'

శ్రీకృష్ణుం డిట్లు చెప్పగానే అర్జునుఁడు "బావా! ఛాయాపురు షు నేకాలమున జూడనగు?" నని ప్రశ్నింప నిట్లనియెను.

"అర్జునా! ప్రాతఃకాలంబున నెన్నిది గడియలనుండి యిరువది నాలుగు ఘడియలవఱకును, రాత్రికాలమున చంద్రకాంతి యున్నంత కాలమును, సూర్యచంద్రులు స్పష్టముగా లేనప్పుడు దీపకాంతియం దును జూడనగు" నని అర్జునునకు ఛాయాపురుష దర్శనముం జేయించెను.

"తరువాత వీరప్రతాపుఁ డేమిచేసె?" నని పాండవమధ్య ముఁడు ప్రశ్నింప, వాసుదేవుం డిట్లనియె.

"అర్జునా! వీరప్రతాపుండంత నాబిలముం జొచ్చి పరిచారికలకు దేవదూతనని చెప్పుచు "కీర్తిచంద్రికా!" యని పిలిచెను. ఆమె వచ్చి నవమోహనాకారుఁడును, జగదేక సుందరుఁడునగు వీరప్రతాపుని గాంచి. "నీవెవ్వ?" రని ప్రశ్నింప, నాతఁడు భాస్కరమహర్షి వలన నామె చరిత్రము నెఱింగి, యట కేతెంచిన విధానముం జెప్పగా, నామె యాతని మర్కటముగా మార్చినచో భాస్కరఋషి శపించు నని భీతిని, తల్లియుంగూడి దలంచుకొనెను. ఉటూడి మనోవేగము తో నచ్చటికరుదెంచి, యావృత్తాంతమును విని నరసి, యామెతో వీర ప్రతాపుని వివాహము చేసికొనుమని చెప్పెను. కీర్తిచంద్రిక "అక్క టా! ఈయపూర్వ సౌందర్యము నరునిపాలు చేయవలయునా తల్లీ!"

యనగా నాలూచి, "అయ్యా! ఈతఁడు భానుకరమహాఋషివలన దేవరహస్యము నెఱిఁగిన ఘనుం" డని పల్కుఁ బలికి, దబ్బడి యోగంబుల వివాహముం జేసెను.

వీరశ్రీతాపుఁడా కీర్తిచంద్రికతో శృంగారసామ్రాజ్యసౌఖ్యభద్రములనతి కాలముగడపుచుండిరి. ఒకనాఁడు మంత్రిసుతుఁడగు మతిమంతుఁడు జ్ఞప్తికిరాగా ఖిన్నుఁడై కూర్చుండెను. కీర్తిచంద్రిక భర్తవిచారమునకు గారణము తెలిసికొని యానావరముల నున్నటి వారిని సముఖమునకు రావించి, మనుష్యులుగాఁ జేసెను. వీరశ్రీతాపుఁడు మతిమంతుని గుర్తించి, తక్కుంగల వారిని విడిచిపుచ్చెను.

అతఁడు నిజరాజ్యమునకుఁ బోవదలంచి, కీర్తిచంద్రికతోఁ జెప్పగా మంత్రికత్తెలను కింకరులుగాఁ జేసి, పయనమయ్యెను. వీరశ్రీతాప మతిమంతులును, కీర్తిచంద్రిక, చెలికత్తెలును దిన్నగా కాశ్మీరదేశముం జేరిరి. వారొక సత్రమున బసచేసి భోజనముకావించి 'ఈయూరి విశేషములేవి?' యని ప్రశ్నింప నొకకాటసారి యాదేశాధీశుఁడగు కళావంత మహారాజు కుమార్తె భారతిని మత్స్యయంత్రము కొట్టినవారి కిచ్చి పెండ్లిచేయుదు" నని ప్రకటించెను అని చెప్పగా కీర్తిచంద్రిక యనుమతిబడసి యారాజకుమారుఁడు మతిమంతునితో స్వయంవర మంటపమునకుంబోయి యెల్లరాజులుం నాశ్చర్యానందమగ్నులగునట్లు ఆమత్స్యయంత్రమును భేదించి, భారతి యను నారాజకుమార్తెను వివాహమాడి, కొన్నిమాసము లానగరమున నుండి, పరివారముతో బయలుదేఱి మద్రదేశమున కరుదెంచి, తల్లిదండ్రుల కానందము గలిగించెను.

దిలీపమహారాజు కీర్తిచంద్రికాధారతులంగని యమందానంద కందళిత హృదయారవిందుఁడై శుభముహూర్తమున నాతనికి పట్టాభిషేకముఁ జేసెను. మతిమంతుని సాయమున వీరప్రతాపుఁడు మహారాజై ధర్మము నాలుగుపాదముల నడచుచుండ చిరకాలము రాజ్యము పాలించి, పుణ్యలోకము నొందెను.

అర్జునుఁడీ కథవిని బావా! నిద్రవచ్చుచున్నదిఁక శయనింత" మనెను. ఇరువురును నిద్రించిరి.

రెండవకథ సమాప్తము.



## మూఁడవ కథ.

---

మూఁడవనాఁటి రాత్రి భోజనాంతరము, శ్రీకృష్ణార్జునులు యమునా స్రవంతీ కూలంబునం గూర్చుండి, తాంబూల చర్వణముఁ గావించుచున్నతఱి మృదుమందమారుతము సోకుచుండ సరససల్లాపము లాడుకొనుచున్నతఱి నర్జునుఁ డిట్లనియె—

"బావా! వేదాంతరహస్యములలో మూఁడవదగు నాదానంద పరిభావమును దెలిపి నన్నుఁ గృతార్థుం జేయుము"

శ్రీకృష్ణపరమాత్మ "పార్థా! నేఁడు నీకు మహారాజు కథ తెలుపుదు నాకర్ణింపు" మని యిట్లు చెప్పెను.

# విక్రమసేన మహారాజు కథ.



తొల్లి పాండ్య దేశమును బరిపాలించు చుండిన యశస్తిలక మహారాజునకు లోకోత్తర సౌందర్యవంతుఁడగు పుత్త్రుఁడు జన్మించెను. అతనికి తలిదండ్రులు విక్రమసేనుడని పేరుపెట్టిరి. ఆ బాలుఁడు గురుముఖంబున సత్త్రశస్త్రప్రయోగము నేర్చి మిక్కిలి బలాఢ్యుఁడని ఖ్యాతిగాంచెను. ఆ రాజకుమారుఁ డనుదినమును దన 'పంచకల్యాణి' అశ్వము నెక్కి నగరము వెలుపలఁ దిరుగుచుండును. ఒకనాఁ డాతఁడు తన హయమునారోహించి, తత్పురబాహ్య ప్రదేశమున విహారము సల్పుచుండ నొకవృద్ధాంగన యేడ్చుచు నాతనిని సమీపించి, "రాయనా! ముసలిదానను తిక్కుమాలినదా నున నీశౌర్యము, సాహసము

చూపులు వదాలనగు నాపికకలమీఁదనా చూపుట? ఈపిడకలమ్ము జీవించుచుండును? మగఁటిమి యున్నచో దానిమ్మకన్నియ మీఁదఁ జూపవలయు నంతియగాని నాపిడకలమీఁద చూపినం గలుగు ప్రయోజనమే” మని ప్రశ్నించెను.

ఆరాజపుత్రుఁడు “ఓ అవ్వా! నీవు పిడకలకొఱకు దీనముగ విలపింపకుము. నీకు వలయు ధనమొసంగెదను. విలాపముమాని, దానిమ్మకన్య విషయమై నీకుఁదెలిసిన విశేషములఁ జెప్పు”మన, నామె “ఓ రాకుమారా! ఒకనాఁడు చితుకుల నేరుటకై నే నరణ్యమునకరిగి, యొక ఖడ్గమృగము కంటఁబడ, మిక్కిలి భయముచెంద తీగలున గుబురుగా పెరిగియున్న యొక పొదమాటున కరిగితిని. అందు పెరుక నిరువురు సన్యాసులు కూర్చొనియుండిరి. ఆసన్యాసులలో నొకఁడు రెండవవానింజూచి “ఓయీ! మిత్రుఁడా! దానిమ్మకన్యను మించిన సౌందర్యవతులీ భూలోకమున నుండ” రని నాయుద్దేశ మనెను.

ఆసన్యాసి “ఆమెను నేనుకూడ నొకసారి చూచియున్నాను. ఆమె భాస్కరునకు నాగరాజునందు జన్మించినది. ఇచ్చటికి చాల దూరమున నున్న ‘మలక’ ద్వీపమునందలి కొలనిలోని దానిమ్మ పుష్పంబుననున్నది. ఆద్వీపము తూర్పు సముద్రమధ్యమున నున్న” దనెను.

ఇంతకంటె నాకన్యవిషయము నాకేమియుఁ దెలియదని యామె స్పష్టంగన పలికెను. విక్రమసేనుఁడు వర్ణనాతీతమగు దుఃఖము నొందెను. ఆదానిమ్మకన్య నెట్లుచూతునాయని యతఁడు తలవించుచు వ్యాలాందోళిత చిత్తుండై, నిద్రాహార విహారముల రోసి సంచరించుచున్న విషయమును గమనించిన మంత్రిరతనయుఁడు “మిత్రమా!

నీవు వగచి, కృశించి దేహదార్ఢ్యము నశింపఁజేసికొననేల? నీవామెను జూచుటకుఁదగిన యుపకరణ మిదె కేయింతు"నని పలికి, నొక గొప్ప శిల్పిని రావించి, వాయువేగ మనోవేగములతో సమానముగాఁ బరువెత్తగల యొక కీలుగుఱ్ఱమును దయారుచేయించి, విక్రమసేనునొద్దకుఁ దీసికొనివచ్చెను.

విక్రమసేనుఁడు ధనవస్త్రాది ప్రయాణ సామగ్రి నా కీలుగుఱ్ఱము యొక్క యుదరములో గుప్తపరచి, దానినెక్కి మలకద్వీపాభిముఖముగఁ బోవుచుండెను. యశస్తిలకమహారాజ కుమారుండగు విక్రమసేనుం గావక డెందమునం గుంది, చారులచే నన్వేషింపఁ జేసియు విఫలమనోరథుం డయ్యెను.

విక్రమసేనుఁడు కీలుగుఱ్ఱమునెక్కి మహావేగముతోఁ బ్రయాణము చేయుచు, నగస్త్యమహర్షి యాశ్రమము సమీపించెను. ఇఁక ముందునకుఁ బోవఁజాలక యా కీలుగుఱ్ఱము కీలూడిపోయి క్రిందపడెను. విక్రమసేనుఁడు స్మృతిహీనుఁడై క్రిందబడిపోయెను. అగస్త్యమహర్షి శిష్యులలో నొకఁడా రాకుమారుని గాయములకుఁ గట్టుకట్టి, శైత్యోపచారములం జేసి, అగస్త్యమహర్షి చెంతకుఁ గొనిపోయెను.

ఆరాజసూనుఁడు తాను దానిమ్మ కన్యను వివాహమాడఁదలఁచితినని తెలిపి యా కీలుగుఱ్ఱమును మరల దన కిప్పించవలసినదిగాఁ గోరెను. అగస్త్యమహర్షి "విక్రమసేనా! నాకీలుగుఱ్ఱమును పునస్సృష్టి చేయుటకు నాకు శక్తిలేదు. తుచ్ఛము, హేయమునగు భోగము నాశించి, యెందుల కిట్లు వృథాప్రయాసమునందెదవు? మము బోటి ఋషులఁజేరి దేవరహస్యముల నెఱింగి ధన్యతఁ గాంచరాదా? పురుషార్థమెుదవునుగదా?" యని ప్రశ్నింప నారాజనందను "మహాఋషిచంద్రమా! శాశ్వతానందదాయకమగు దేవరహస్యముం దెలిపి, నన్ను కృతకృత్యుం జేయు" మని వేడెను.

కరుణాంతరంగుఁడగు నయ్యగస్త్యమహర్షి "వత్సా! కాంతల తోడి పొందే యానందమని మూఢులు తలంచి తమ జన్మల నిరర్థకము కావించుకొందురు. దేవఋషిగణంబును మాధవులలోఁ బుణ్యశీలురును నాదానంద ప్రధానమును గుర్తెంచి, యనూనానందముం జెంది తరించినా రద్దానిం దెలిపెద నాలకింపుము. నిత్యానందము గూర్చు ప్రణవనాదము దశవిధములుగా మ్రోగుచు చిణి చిణి యను ధ్వని నావిర్భవింపఁజేయును.

'ఓం, హ్రీం, శ్రీం, హం,సం, అను నీహంస పంచాక్షరీమంత్రి మునుమరువకుమని దన యంగుళిద్వయంబుచే కర్ణపుటముల మూసి, జలధ, ఘోష, భ్రమర నాదము, భేరి నాదము, మృదంగనాదము, భూరినాదము, తాళనాదము, శంఖనాదము, ఘంటానాదము, వేణునాదము, మేఘనాదమునను నీదశవిధనాదములు గ్రీవాస్థంబైన కుండలియందు నిరంతరము మ్రోగుచుండును. దీనినే ప్రణవకుండలియనియు, జ్యోతిర్మయంబనియు, జెప్పుచుందురు. అవి యడఁగియుండుటవలన లాభము గలుగనేరదు. ఇడాపింగళానాడులలో సంచరించు హంసయొక్క మార్గమును నిరోధించి, తిక్కైన మార్గమును బలముతో ఛేదించి, పూరించి, కుంభించి మరల ఛేదించినచో దశవిధంబులగు నాదంబులు కర్ణపుటంబుల వైకివచ్చి చిణి చిణి యని ధ్వనించు చుండును. ఈశ్రవణ వనాదమును మనస్సున లీనము చేసికొని, బ్రహ్మానంద సౌఖ్యమొంది, కనులమూసియుంచుకొని, భ్రూమధ్యంబున దృష్టినిలిపి, ఆనందింపు" మనెను.

ఆరాజనందనుఁడు భక్తిశ్రద్ధలతో నామునీంద్రుండు వచించిన తెఱంగున నాహంసపంచాక్షరీమంత్రంబును నిర్మల చిత్తుండై ధ్యానింపుచు నజపకుండలిం ఛేదించి, నభ్యాసముం జేయగా నాదబ్రహ్మము విజృంభించి, ఝుంకారము చేయుచు మ్రోగ సాగెను. విక్రమసేనుం

దంత వాదశవిధవాదంబులను వాక్రుచ్చి, నిరవధికానంద భరితాంతః కరణుండై, అగస్త్యమహర్షి పాదములపైఁబడి "మహాత్మా! అవర్ణ్యమగు సుఖము నాపాదించు నాదానందము ననుభవించి తరించితిని" అని పలికి, యా ఋషిచంద్రునకు నమస్కారములఁ జేయుచుండె" నని శ్రీకృష్ణుండు సుభద్రామనోహరునకుం బలికిన, నతండు "మహాత్మా! భగవత్కథా కాలక్షేపంబు వలన మహారహస్యముం దెలిసికొనఁగలిగితిని విక్రమసేనుం డేమయ్యెనో తెలుపు" మనుటయు, నాకథాభాగముం దిట్లని వచింప దొడంగె.

"విక్రమసేనుం డొకనాఁ డగస్త్యమహర్షి యాశ్రమమున్న వనంబున చాలదూరమరిగెను. ఒకచో నాతఁ డొక వటవృక్షంబును గాంచి, యావృక్షమ్మైశాల్యమున కెంతయు విస్మయంబొంది, "అహా! ఈమహీరుహము దేవవృక్షంబై యుండనోపు కాదేని యింతగా విస్తరించి యుండ" దని తలంచి, యావృక్షచ్ఛాయను విశ్రమించెను. అంత నావృక్షశాఖలపై గూర్చుండిన పక్షులు వికృత ధ్వనులఁ జేయగా, నారాజసూనుం డాపద శంకించి, యావృక్షమువంకం దన దృష్టిసారించెను. భయంకరమగు సర్పమొకటి చెట్టుపై కెగఁబ్రాకు చుండుట దిలకించి, యాసర్పము పక్షులఁ జంపునని భయపడి వెంటనే తన యమ్ములపొదిలోని నాఁడియమ్ముతో నాసర్పశిరమును ఛేదించెను. ఆమహాసర్పవిషము నల్వంకలఁ జిమ్మి, యా రాజేంద్రనందనుని కాయముపైఁ బడుటచే నతఁడు సమీపముననున్న యొక కొలనులో శరీరమును గడిగికొని, జలంబులఁ ద్రావెను. ఆనీరంబులు, విషపూరితములై యుండుటచే నావిషము తలకెక్కి యావిక్రమసేనుఁ డాయుత్తరక్షణంబుననే యసువుల విడెను.

వటవృక్షశాఖాగ్రంబులపైఁ గూర్చుండిన పక్షులు విక్రమసేనుఁడు భూపతితుండగుట గమనించి, "అయ్యో! అత్యధిక మై

ర్య సాహసోపేతుండగు నీరాకొమరుండు మనల రక్షించి, మృత్యువు వాతఁబడెనే? ఏదైన నౌషధములంగొనివచ్చి, యీతని రక్షించుటకు మనకింకను శక్యము రాలేదుగదా! మన తలిదండ్రు లరుదెంచిన పిదప నీయుదంతమును సాంతముగఁ దెలిపి, యీతఁడు సజీవుఁడగు జతనము సలుపవలయు"నని యెంచెను.

ఆపక్షుల తలిదండ్రులగు గండభేరుండ పక్షు లరుదెంచుచు తమ తనయుల కిలకిలారావములు వినబడకుండుటకు వంతంజెంది "అయ్యో! ఆపాము మనపిల్లలఁ దిన ప్రాణంబెట్టుకొన్నది కాబోలు నేనెన్ని రీతులఁ జెప్పినను, నీవు మన నివాసము నిచటినుండి మార్ప వైతి" వనెను. అవి యావృక్షమును సమీపించి తమ బిడ్డలు సేమముగానుండు టరసి, ఆనందించి, "బిడ్డలారా! నేఁడేల మీవదనములు భేదమును సూచించుచున్నవి? మిమ్మెవరైన నవహసించెనా? మీకెవ్వరైన హానిసలుప నిచటికేతెంచిరో?" యని పలుక, నవి గద్గద కంఠమున నిట్లనియెను.

"అదిగో, ఆకొలనుయొద్దనఁ బ్రాణములఁబాసియున్న రాకుమారుఁడు మమ్ము కబళింపవచ్చిన యాక్రూరభుజంగముం దునిమి, మమ్ముల రక్షించి, యా విషము మేనిపైఁ బడుటచే కొలనుకుఁబోయి, ఆవిషమునకోర్వలేక ప్రాణములఁ బాసినాఁడు. ముందుగా మారక్షకుని పునర్జీవితుం జేయరేని, మేమాహారము భుజింపనొల్లము."

తమ బిడ్డల కార్యసాధన తత్పరతకు మోదంబంది, యాగండభేరుండపక్షులు గగనమార్గమున కెగిరిపోయి సంజీవిపర్వతమునందలి విషగ్రాహికలగు మూలికలఁ గొనివచ్చి, విక్రమసేనుని బ్రదికించినవి. విషమయమైన యావాహినిం జక్కఁజేసినవి. రాజనందనుఁడు కొలనులోని నిర్మలనీరంబులఁ, గ్రోలి సేదదీఱినపిదప వారలతోఁ దమ

బిడ్డల ప్రతిజ్ఞను చెప్పగా వరుడా చిన్నపక్షుల ఆహారము స్వీకరింపుమనెను. అప్పుడవి యాహారము స్వీకరించినవి.

విక్రమసేనుఁడంత నాపక్షులకు దానిమ్మకన్య వృత్తాంత మెఱింగించి, తానా కన్యను వివాహమాడునట్లు చేయుమని కోరెను. ఆపక్షులాశ్చర్యము వెలిబుచ్చుచు "ఓ రాకుమారా! సూర్యునకు నాగరాజునందు జన్మించిన ఆకన్యను బదివేలమంది రక్కసులు నిరంతరము కావలిగాయుచుందురు. ఆరక్కసుల నుక్కడించి, యామెను గొని వచ్చుట దుస్తర" మనగా నాపక్షుల బిడ్డలు "తప్పక మీకీ యుపకారమును జేయగలము" వని చెప్పఁగా విక్రమసేనుని యాగంతకుండ పక్షులు బయలు దేఱినవి.

విక్రమసేనుఁడు మగపక్షిపైఁ గూర్చుండెను. ఆమగపక్షి సూర్యుని కష్టంబుగా నెగుచుండెను. ఆపక్షులు మలకద్వీపమునందలి కొలను సమీపించెను. విక్రమసేనుఁడు దానిమ్మపుష్పమును గోసి తనయొద్ద నుంచుకొనెను. రక్కసులు విజృంభించి యాపక్షులను దాకిరి. ఆపక్షులు తమ వాడిముక్కులతోఁ బొడువగా నారాక్షసులు చిందరవందరమై పారిపోయి నాగరాజున కవ్వార్త నెఱిఁగించిరి. పక్షులు రాజకుమారుని వటవృక్షమునకుఁ దీసికొనివచ్చెను.

నాగరాజు వెడలి దేవేంద్రునితోఁ దన కుమార్తెను హంసపక్షులు మోదికొని వచ్చిన నరుండు గొనిపోయెనని చెప్పి, యాపక్షులతోడి యుద్ధమునకై సాహాయ్యము చేయరమ్మని కోరగా నింద్రుఁడు "నాగేంద్రా! ఆపక్షులు మానవుని గొని వచ్చినందున మనము త్రోసిరాజనందగదు. మన మొకవేళ వారి మీఁద [illegible]బునకు సన్నద్ధులమైనచో, వారి కూఁతఁగ గరుత్మంతుఁడు రావచ్చును [illegible] చేత మీరు ముందుగా నేగి, యుద్ధమునకు, దలపడుఁడు, వారిబలగము విశేషమైయున్నచో నేనరుదెంచి, యాపోరునాపి, మన కన్యకను నాతని కిచ్చి పెండ్లిచేయుద" మని వాకృచ్చెను.

'అటులే' యని పలికి నాగేంద్రుఁడు సర్పములనన్నిటిని సంగర ముసకుఁ బురికొల్పెను. ఆపన్నగములు భయంకరవిషాగ్నుల వెడలఁ గ్రక్కుచుఁ దిన్నగా నావటవృక్షంబు దరి కరుదేర, విక్రమసేనరాజ కుమారుఁడు ఆగ్నేయాస్త్రముఁ బ్రయోగించెను. నాగములలోఁ గొన్ని ప్రాణములఁ బాసెను. నాగేంద్రుఁడు మఱల నింద్రునితో నీవిషయముం జెప్పఁగా, నాతఁ డేతెంచెను. ఇంతలోనే గండభేరుండ పక్షులు కూడ వరుదెంచెను.

శచీనాథుఁ డంతట నా దానిమ్మ కన్యకను, విక్రమసేన రాజ కుమారునకును బెండ్లి చేసెను. నాగేంద్రుఁడు కుమార్తెకు నల్లునకు దివ్యాలంకారగుకూలములనిచ్చి, వెడలిపోయెను.

విక్రమసేనుం డగస్త్యమహర్షిని పక్షులసాహాయ్యంబునదర్శించి, కృతజ్ఞతావందనముల నర్పించెను. పక్షులా దంపతులను బాండ్యదేశ మునకు దీసికొనివచ్చి, యచ్చట దించి, వెడలిపోయినవి. చారుల వలనం దన కుమారుఁడు తిరిగి వచ్చెనని యెఱింగి సపరివారంబుగ నెదురేగి, యాతనిం దోడ్కొనివచ్చి పట్టాభిషేకముఁ గావించెను."

అర్జునుఁడు "బావా! నిదుర కనుల మూయుచున్న దింక శయ నింత" మనెను. ఇరువురును నిద్రించిరి.

మూఁడవ కథ సమాప్తము.



## నాలుగవ కథ.

---

నాలవనాటిరాత్రి నరనారాయణులై వెలసిన శ్రీకృష్ణార్జునులు మరల నెప్పటియట్లు సంతోషసాగర నిమగ్నులై పావనయమునా స్రవంతీజలతరంగమంజులఘోష నాలకించుచు సరసనల్లాపముల గాలముంబుచ్చుచున్నతఱి నర్జునుండు "దేవా! వేదాంతరహస్యములం దైదవదగు పంచమదిలర్గిభావము నాకెఱింగించి తరియింపం జేయు"మని గోవిందుడు ప్రఫుల్లవదనారవిందుండై 'యర్జునా! నేడు నీకు చిత్రధ్వజమహారాజుచరిత్రయుం దెలిపెదశ్రద్ధతో నాకర్ణింపు'మని యిట్లుచెప్పదొడంగెను.

## చిత్రధ్వజమహారాజుకథ.

పూర్వము చేరదేశమును గపిధ్వజమహారాజు ప్రజలంగన్నబిడ్డలవోలె భావించి పరిపాలించుచుండెను. ఆతనికి రత్నావతియనుసతి కలదు. ఆదంపతులు సంతానముగలుగకుండుటకై చింతించుచుండిరి. దానధర్మములిచ్చిరి, పెక్కుపుణ్యనదులంగ్రుంకులిడిరి గాని సంతానలాభము కలుగదాయెను. ఒకనాడు రాజు వాస్థానమున కొకయోగిపుంగవుం డరుదెంచెను. తపోమహిమచే నుజ్జ్వలకాంతియున్న యామునీంద్రుని వదనమండలముంగని రాజేంద్రుడాతని నర్ఘ్యపాద్యాదివిధుల బూజించి యంతఃపురమునకు దోడ్కొనిపోయెను. రత్నావతియు నామునీంద్రునకు నమస్కరించి తన హృదయంబును వ్యథింతంబొనరించుచున్న చింతాకారణము నెఱింగించెను. ఆమునీంద్రుండు నాయమకంఠ

నొకమంత్రముపదేశించి నిశ్చలచిత్తముతో ధ్యానింపుమనియు నొక యాగముం జేయవలయుననియు జెప్పి వెడలిపోయెను.

మునీంద్రుని యాదేశానుసారముగ నాదంపతు లిరువురు నా నిష్ఠ. యాగకాలమున నగ్నిహోత్రుడు ప్రత్యక్షమై "ఓపుణ్యదంపతులారా! కొలదికాలంబున సంతానలాభము కలుగును. సుపుత్రుడుదయించి యీయాగము కలిగించు"నని పలికి యంతర్ధానము నొందెను. అనంతరమున నవమాసములు గడచినపిదప నఖండతేజోవిలాసమున్ అగు పుత్రునిం గనెను. ఆదంపతు లాపుత్రునకు చిత్రధ్వజుడని నామకరణముచేసిరి.

చిత్రధ్వజుడు దినదిన ప్రవర్ధమానుండై గురుముఖంబున సకల శాస్త్రంబులను నభ్యసించి తలిదండ్రుల కానందము గలిగించుచుండెను. ఇట్లుండగా నొకనాడు ఆదేశంబున 'వంగదేశాధిపతి తనయ శారదాస్వయంవరము జరుగు'నని ప్రకటింపబడెను. వివిధదేశంబుల నుండి రాకుమారు లాస్వయంవరమున కరుగుచున్నారనివిని చిత్రధ్వజుడు తానుకూడ స్వయంవరమునకుం బోవుట కనుజ్ఞయిమ్మని తండ్రిని కోరెను. కపిధ్వజుడు కుమారు నుద్దేశించి "నాయనా! నీవు స్వయంవరమునకుం బోవలదు. అచ్చటికి నీకంటె శస్త్రవిద్యయందు వేయిరెట్లు వైశారద్యముగల మేటివీరులగు రాజపుత్రు లరుదెంతురు. నీవు వెడలి అవమానమునొందుటకంటె వెడలకుండుటయే శ్రేష్ఠము" అనిచెప్పెను

"అట్లనకుడు తండ్రీ! సూర్యవంశోద్భవుడనై జన్మించి, ఏ యవమానమునకైన వెరచి యూరకుండుట తగదు. తండ్రీ! ఎట్లైన నేనటకుం బోవలయు" నని పలికిన కుమారుని కోరిక త్రోసివేయంజాలక, యా ధరేంద్రుడు చతురంగబలములను సాయముగా నిచ్చి పంపెను.

చిత్రధ్వజుఁడు సపరివారుఁడై వంగదేశమున కరిగెను. మంత్రి యారాజపుత్రుల సందడిని నుద్దేశించి, యొక శారికాయంత్రముం జూపెను. ఆయంత్రము కొట్టకొన నొక చిలుకయొక్క ప్రతిమ కట్టబడి యుండెను. "ఆచిలుకయొక్క ప్రతిబింబమును యంత్రమున కడుగున నమర్పఁబడియున్న దర్పణంబునంజూచి బాణములోఁ గొట్టిన వారికిఁ దమరాజకుమార్తె నొసంగి పరిణయము కావింతు" మని జెప్పెను ఆయంత్రము ప్రక్కనే యొక ధనస్సుండెను. ఆధనస్సెత్తుట కెవ్వరికిని శక్తి చాలకుండెను. స్వయంవరమున కరుదెంచిన రాజపుత్రులందఱును ఆబాణము నెత్తఁజాలక, 'యిదియేమి మహాయంత్ర' మని యాశ్చర్యము నొందుచు, సౌందర్యవతియగు శారద తమకు లభింపకపోయెనే యని విచారించుచుఁ దమదేశములకు తిరిగి వెడలి పోయిరి.

చిత్రధ్వజుండు దుస్సహముగనున్న యీ విచారము భరింపఁజాలక, యీరాజకుమారి లభింపని తన జీవితము వమ్మనియెంచి, పరాభవానల దందహ్యమానమానసుండై, వస్త్రాభరణములు విసర్జించి సన్న్యాసాశ్రమమును స్వీకరించుటయే యుక్తమని తలపోసి, యానాటిరాత్రి యెవరికిని దెలుపకుండ వెడలిపోయెను. తమ రాజకుమారుంగానక, సైనికులు మిక్కిలి పరితపించి, తమ రాజేమయెనో యను భీతికి లోనై విచారభరితహృదయులై చేరదేశమునకు వెడలిపోయిరి.

చిత్రధ్వజుఁడు సూర్యతాపమునకుఁ జిక్కి, వన్నెదొఱఁగిన వదనముతో నరణ్యమున కంటకాన్వితమైన మార్గమున నడుచుచు దిన్నగా పోయి, అత్రిమహాముని యాశ్రమముఁ జేరెను. అత్రిమహాముని యారాజపుత్త్రు నాదరపూర్వక వచనములచే సమాశ్వాసించి, "రాజకుమారా! నీవృత్తాంత మెఱిఁగింపు" మన, వాఁడు తాను తిక్కమాలిన వాఁడననియు, మోక్షమార్గము నెఱుంగు కోరికతో

నట కేతెంచిననియుఁ దెలిపెను. ఆఋషీశ్వరుం డక్కజమంది "వత్సా! మీరాక్షమన నేమనుకొంటివి? అది తపోనిష్ఠాగరిష్ఠులగు మావంటి మునులకే దుర్లభమగునెడ నీకెట్టు లబ్ధాని సాధింపనగును? కావున, నీవీ ప్రయత్నమునుండి విముఖుఁడవై, యింటికి మరలిపొమ్ము. నీకు సుఖం" బగునని పలుక, చిత్రధ్వజుండు విషాదరేఖాంకిత వదనుండై కనుల దుఃఖాశ్రుకణముల రాల్చుచు, "మహాత్మా! ఒకవిషయమున నవమాన పరిభూతుఁడనై యున్నవాఁడను. మీరు నాకోరిక సఫలీకృత మొనరింపరేని మీయెట్టయెదుటనున్న మహోన్నత వృక్షశాఖకురిపోసికొని ప్రాణత్యాగము కావింతు"నని పలుక నాయోగీంద్రుండు దయారసం బుప్పతిల్ల నిట్లుపలికె.

"చిత్రధ్వజరాజకుమారా! పద్మాసనాసీనుండవై నడుము నిక్కించియుండి, కనులమూసికొని, ముక్కుయొక్క కొనయందు బుద్ధినిలుపుము. హాం, సః, యను నదియే మనోబుద్ధి. దీనికి రెండు రేఖలున్నవి. దీని నడుమనుండు సుషుమ్నయనునాడి అపోజ్యోతి యనంబడును. దీనినే పెద్దలు బిందుస్థానమని పేర్కొందురు. ఈబిందు స్వరూపమే ఓంకారప్రణవంబనియు, నేత్రద్వయనళినదళద్వయ కమలంబనియుఁ, నవస్థాత్రియంబనియు, త్రికూటస్థానంబనియు, నిడాపింగళ నాడుల మధ్యనుండు సుషుమ్నానాడియనియు, సరస్వతి నాడియనియుఁ జెప్పఁబడును. దీనినే ఆకాశపంచకంబందురు ఈఆకాశపంచకమునందే పంచభూతములు, పంచస్థానములు, పంచముద్రలు, పంచకళలుకలవు. పంచముద్రప్రభావము నాలకింపుము.

నాసిక కొనయందు సూర్యచంద్రబింబములు గోచరించును కన్గొనుము. అవి లయించుచున్నవి. దానినే ఖేచరముద్రయందురు. పృథ్వి దీని కధిదేవతయై యొప్పుచున్నది. నడుము నట్టే నిగిడ్చియుంచి ముఖమునం బైకెత్తి, లోచనములనుమూసికొని, త్రికూటస్థానమునదృష్టి

నిలిపి చూడుము. దీనిని ఖేచరముద్రయందురు. దీని కాకాశము అధి దేవతయై వెలయుచున్నది.

కనుఱెప్పల రెండింటి నొకదానికొకటి తగులనీయక నిలువు జ్యోతుల మొనకులను జేర్చి లోచూపుచూడుము. దీనినాంతర్లక్ష్యముద్రయందురు. సూర్యచంద్రులు దీనికధిదేవతలై విలసిల్లుచున్నారు. శ్రోత్ర, నేత్ర, నాసికారంధ్రముల నాఱువ్రేళ్ళతోమూసి ప్రాణాపానముల నొక్కటిగాఁజేర్చి త్రికూటస్థానమున హంసనునిల్పిచూడుము. దీనిని షణ్ముఖముద్రయందురు. గురుఁడు దీనికధిదేవతగా నొప్పుచుండును. నడుము నిగిడ్చియుంచి ముఖముకొంచెమువంచి కన్నులనుమూసికొని తొడలమీఁద హస్తములనుజేర్చి ప్రాణాపానంబులనొక్కటిగా జేర్చి హంసను త్రివేణీసంగమంబునఁజిక్కఁబట్టి హృదయమును మూరుతమునుజేర్చిచూడుము. దీనిని శాంభవీముద్రయందురు. దీనికధిదేవత కైలాసలోకాధీశుండగు సాంబశివుఁడై యొప్పుచున్నాఁడు."

ఇట్లని అత్రిమహామునివలన దృగ్దృశ్యభావములన్నియు నెఱింగి యాయోగికి నమస్కరించి "మహాత్మా! ఖూచరముద్ర ప్రయోజన రహితముగను, ఖేచరముద్ర కష్టయుక్తముగను, అంతర్లక్ష, షణ్ముఖ ముద్రలత్యంతకష్టసాధ్యములుగ కన్పట్టుచున్నవి. శాంభవీముద్ర ముక్త్యధికానందసంధాయకము. దీనినే నేనభ్యాసము చేయుచుందు''నని పలికి యా రాజనందనుండా యాశ్రమములో ఋషికి శుశ్రూషలు కావించుచు కాలముగడపుచుండెను.

చారులవలన కపిధ్వజమహారాజు తనకుమారు డత్రిమహాముని యాశ్రమమున నున్నాఁడని తెలిసికొని సైనికులనంపెను. వారామునితో రాజపుత్రుని సమాచారమెఱింగింప నాఋషీంద్రుఁడు "అయ్యయ్యో! ఈరాకుమారుఁ డీవార్త ముందుగా జెప్పియున్నచో సన్యాసా

క్రియ స్వీకార మొనరింపఁ జేయకుందునే" యని పలికి రాజపుత్రుని వారితోఁ బోవుట కనుజ్ఞనీయ వాతఁ డిట్లనియె.

"మహాత్మా! శారదయను కన్యం బెండ్లిచేసికొన దలంచి నేను చేరదేశమునుండి బయలుదేఱియుంటిని. ఆశౌరికా యంత్రలక్ష్యమును ఛేదింపఁజాలక విషాదవేదనా విదళితమానసుండనై, సంసారమునెడ విరక్తి జనింప, నామెనుబొందని జీవితము వృథయని తలంచి, తపోవృత్తినుండుటకై భవదీయాశ్రమంబున కేతెంచితిని. ఇప్పుడా కన్యను బొందక, నేనెట్లు చేరదేశమున కేగుదును?"

ఆఋషీంద్రుఁడంత కరుణాంతరంగుండై యాచిత్రధ్వజు నుద్దేశించి, "కుమారా! నీవిపుడిందులకుం వగవంబనిలేదు. నీవు పంచముద్రి ధ్రిభావిభాసితుండ వగుట, నీకీకార్యమునందైన విజయమే లభించును. వేగమ నామెను బెండ్లాడి నిజదేశంబున కరుగు"మన, నాతఁడు నట్లేయని, యాయతిమహామునీంద్రునకుఁ బ్రణమిల్లి, ససైన్యముగ వంగదేశంబున కరిగెను.

రెండుసంవత్సరముల నుండియు, నాయంత్రలక్ష్యము ఛేదింపఁబడనందున, శారద యిప్పటికిని, నవివాహితయై యుండెను. ఆమె తండ్రి తన తనయకింక నెప్పటికిని వివాహము కాదేమోయని భీతిలుచుండెను. మంత్రి "అయ్యా! ఇంక నొకటి రెండు మాసము లోర్చియుండు"మని యూఱటఁ గలిగించుచుండెను. ఇట్లుండగా చిత్రధ్వజుఁడు వంగదేశపు దుర్గముయొక్క సింహద్వారమునకు గట్టబడియున్న గంటను గణగణమ్రోగించెను. తన నందనను బరిణయంబాడుట కెవరోవచ్చియున్నా"రని తలంచి యారాజు సేవకునిబంపి ఆవచ్చిన వానిం దోడ్తెమ్మనెను.

మునివేసముననున్న చిత్రధ్వజుఁడు తానేతెంచిన కార్యముం దెలిపి, యాశౌరికాయంత్రము సమీపించి, ఎవరికిని ఎత్తనశక్యమై

యున్న ధనస్సును సులభముగా* తనశక్తి ధనుష్టంకారముం జేయు దిక్కులు మార్మ్రోగెను. అతఁడు సులభముగా నాలక్ష్యమును ఛేదించి యెల్లరు నాశ్చర్యాంబుధి మగ్నులగునట్లొనరించెను.

ఆదేశాధీశుఁడగు నృపాలుఁడును, నాతని తనయ శారదయుఁ గూడ "అయ్యో! తుదకు వనభూముల సంచరించు మునిబాలకుని పాలుకావలసివచ్చెనా?" యని డెందంబున కుందిరి. మంత్రి యాతఁడు ప్రచ్ఛన్న వేషధారియైన రాకుమారుఁడు గాని, తాపసికాఁడని వారికి నచ్చఁజెప్పెను.

ఇంతలో చిత్రధ్వజుని సైనికులట కరుదెంచి, యారాజునకు నిజవృత్తాంతముం దెలిపిరి. శారదా చిత్రధ్వజులకు మహావైభవముగ వివాహము చేయఁబడెను.

చిత్రధ్వజుఁడు కొన్నాళ్ళటనుండి, మామగారిచ్చిన కానుకల గొని, తన సతీమణియగు శారదతో బయనంబై, కతిపయ దినంబులకుఁ జేర దేశంబు సమీపించెను. కపిధ్వజుం డీవార్త చారులవలన నాకర్ణించి పురమంతయు నత్యంతమనోహరముగ నలంకరించెను.

చిత్రధ్వజుఁడు పురప్రవేశ మొనరించు తఱి పౌరాంగనలు సౌధములపైనుండి మంగళాక్షతలఁ జల్లిరి. మంగళహారతుల నిచ్చిరి. శుభముహూర్తమున చిత్రధ్వజునకు రాజ్యపట్టాభిషేకముఁ జరిగె" నని కృష్ణుఁడు చెప్పఁగా నర్జునుఁడు "బావా! నీకృపవలన నేను ప్రమోదము నొనగూర్చు కథను వినుటయేగాక పంచముద్రల ప్రభావముం దెలిసికొని, ధన్యుఁడనైతిని. నాకు నిద్ర కనులు మూతపడుచున్న" వని మేను వాల్చెను.

శ్రీకృష్ణుఁడు కూడ యమునానదీతరంగముల [illegible] నాలకించుచు నిద్రాపరవశుం డయ్యెను.

నాలుగవ కథ సమాప్తము.

## అయిదవకథ.

---

అయిదవనాఁటి రాత్రి గోపీమనోవల్లభుఁడగు శ్రీకృష్ణుండును, పాండవమధ్యముండగు నర్జునుండును పావన యమునా నదీతోయంబు లందో యజారాతి ప్రతిబింబమును గాంచి యానందించుచు వివిధ విషయములంగూర్చి ముచ్చటించుచుండ ఫల్గునుం డిట్లనియె. "బావా! నేఁడెవరికథం దెలిపి నన్నుం దరింపఁ జేయ నిశ్చయించితివోయి" యని ప్రశ్నింప, యదుకుల భూషణుం డిట్లనియె:—కిరీటీ! తారకమంత్రి ప్రభావమున కృష్ణకుమారిని బెండ్లియాడిన శశిబిందు మహారాజుకథ ను దెలిపెద. సావధానమతివై యాకర్ణింపుము.

## శశిబిందుమహారాజుకథ.



తొల్లి అంగదేశమును బరిపాలించుచున్న చిత్రవాహనమహా రాజునకు సావిత్రీవరప్రభావమున నలుగురు పుత్రులు జన్మించిరి. ఒకనిపేరు చిత్రాంగదుఁడు రెండవవాని నామధేయము చిత్రకేతుఁడు మూఁడవవానిపేరు చిత్రరథుఁడు నాలుగవవాని నామము శశిబిందు కుమారుఁడు మాళవదేశ రాకుమారి యగు కాంతామతి చిత్రాంగ దునకును, కాంభోజదేశ రాజపుత్రియగు శృంగారవతి చిత్రకేతునకు ను, తృతీయ తనూభవుండగు చిత్రరథునకుఁ గాశ్మీరరాకుమారి భద్రావతియుఁ బరిణయముఁ జేయఁబడిరి. చిత్రవాహనమహారాజు తాను జీవించియుండగనే నాలుగవపుత్రుఁడగు శశబిందు కుమారు నకుఁ గూడ వివాహముచేయఁదలంచి, వివిధదేశాధిపతులగు మహా

రాజుల కుమార్తెల ఛాయాపటములం దెచ్చించి చూపించెను. అతఁడు తనకా చిత్రరువులలోని మత్తకాశిని యొక్కటెయు నచ్చలే'దని పలికెను. తనకు నచ్చిన రాజపుత్రిని గాని వివాహముచేసికొన నని నిశ్చయముగాం బలికెను. అందరు వారిని త్వరలో వివాహము చేసికొని, వృద్ధులైన తలిదండ్రులకు బ్రమోదము ఘటింపు" మని చెప్పుచుండుటచే, శశబిందుకుమారుఁడు "అక్కలారా! అందరును నన్ను వివాహముచేసికొనుమని నిర్బంధించుచున్నారు. అన్నలు వాలో నీవిషయమై కోపముచెంది, సంభాషించుట మానినారు. వదినలీ విషయమున నెట్టియభిప్రాయము కలిగియున్నారో తెలిసికొని, తనకు గున్యముగఁ బ్రివర్తింతు"నని పలికి, మధ్యాహ్నమువేళ వారు కూర్చుండు చావడివెనుక నున్న యొక గదియందెవరికిని దెలియకుండ రహస్యముగా నుండెను.

భోజనాంతరమూ మువ్వురు తోడికోడ ళ్రును చావడిలోని కరుదెంచి, తాంబూలచర్వణము గావించుచున్నటి వారిలోఁ బెద్దకోడ లగు శాంతామతి యిట్లనెను.

"సోదరీ మణులారా! మన మఱంది శశబిందు కుమారుఁడు కూడ వివాహముచేసి కొన్నచో మనము సలుపురమై, ఆనందబ్రిద ముగఁ గాలము గడపుదముగదా."

రెండవకోడలగు శృంగారవతి "అక్కా! అతని కెట్టిసుందరాంగియు నచ్చుటలేదు. మన మింక నేమి చేయనగు" ననిపలికెను.

మూఁడవకోడలగు భద్రావతి "అక్కలారా! మనమఱది లో కోత్తరసౌందర్యబ్రిభావిభాసితుండగుట నందముగల కన్యనుగోరుట సహజమే. అతనికిందగినకన్నియ యీధరాతలమున నెందును గాన రాదు కాని నాపినతండ్రియైన సుగుణకలాపమహారాజుకుమార్తె జగన్మోహినియను నామె నిక్కముగా జగన్మోహినియై విలసిల్లుచున్నది.

[illegible]ములకు మిక్కిలి సంతసించి యొక భయంకరరాక్షసి [illegible]యైన కామెను గొనిపోయినది. మాపినతండ్రి మహా[illegible]ంచి యమోఘములగు మంత్రశక్తులఁ బ్రయోగించి నను [illegible]సి సాధ్యపడనందున విచారభరితాత్ముఁడై యార [illegible] మనమఱదికి దగిన"దని పలుక నాయిరువురును [illegible]లై నిజముగా నామె యసాధారణసౌందర్యవతి [illegible] మఱదిగాని మరెవ్వరుగాని యాకన్యాలలామను దీసికొనిరా నశక్తులుగదా"యని తమతమ శయ్యాగారములకు వెడలిపోయిరి.

శశబిందు కుమారుఁడు తన హర్మ్యమునకరిగి "ఆహా! ఆజగన్మోహినిని పొందని నాజీవిత[illegible]ములకు? నేనట్టిలావణ్యవతిని చేఁజిక్కించుకొందు"నని [illegible] "ఆను ఎట్లైనను నాకులభింపదు. [illegible] నేను చేరఁజాల నింక నీరాజ్యాధికారమును సుఖ[illegible]ను విడనాడి వైరాగ్యముంబూని కానలముల సంచరించి [illegible]"నని దృఢముగ సంకల్పించుకొని వస్త్రాభరణ ధనధాన్యములను గొనికొని తాను లోకసంచారమొనరించి తనకు వచ్చిన [illegible]నని చెప్పి తలిదండ్రుల నంగీకరింపజేసి బయలుదేఱెను.

దుర్గమ పర్వతముల నారోహించుచు, వడిగల ప్రవాహముల నీదుచు, కందమూలాదుల భక్షించుచు నాతఁడనేక యోజనములు గడచి శుకమహర్షి యాశ్రమముం జేరి, క్షుత్పిపాసాపేతుఁడై పడిపోయెను. ఆఋషి శశిబిందు కుమారుని సేదఁదేర్చి, క్షీరమును ద్రావనిచ్చి, "వత్సా! నీవేతెంచిన కార్యమే"మని పలుక నాశశబిందు కుమారుం డిట్లనె—

"మహాత్మా! నేను మలయద్వీపపురాధిపుని సాకుచున్న జగన్మోహిని యను రాజపుత్రిని ప్రేమించియుంటిని. ఆమె నాకు లభ్యమగుట కలలోని వార్తయని గ్రహించి, ఐహికవాంఛా విరక్తుండనై బయలు దేరి తమ యాశ్రమముం గంటిని. నాకేదైన మహామంత్ర ముపదేశించి, చిత్తమునకు శాంతిం గూర్పుం" డని పలికిన రాజకుమారునకు శుకమహర్షి "నాయనా! నీకు పరమ రహస్యంబును, సత్యాంత మహిమాన్వితంబును నగు తారకమంత్ర ముపదేశింతును. నిశ్చలమనస్కుండవై యామంత్రమును ప్రత్యక్షలాభముదితాత్ముండవుక" మ్మని పలికి, ఆమంత్రము జపించి, చాలమంది పుణ్యపదమందిరని పలికి వెండియు నిట్లనియె.

"తారకమంత్రంబనగా ప్రణవము. ఈప్రణవమునందు అకార ఉకార మకారములు ఉత్పత్తియై త్రిమూర్తుల స్వరూపముం దాల్చినవి. అయం, ఆత్మాబ్రహ్మయను శ్రుతికలదు. చైతన్యమూర్తియైన ఆత్మారామబ్రహ్మము వివిధములగు శరీరముల బ్రవేశించును. అదే యాత్మాం దనబరగు. అంతర్బహిర్వ్యాపకత్వముగలిగి త్రిమూర్త్యాత్మకంగా లింగ కాయములకు భంగమువచ్చునంత రేయింబవళ్ళు సోహంసోహంబను లతో షడక్షరయుక్తమై తంత్రిరూపమును రవిచంద్రనాడులయందు దినంబున 21, 600 పర్యాయములు నడచుచుండును. దీనినే ప్రణవమనియు, తారకమంత్రమనియు, నందురు. సకారోకారంబును, బిందుయుక్తంబైన హకారంబును రేచకపూరకాదులలో జపించుచు సర్వకాలసర్వావస్థలయందును పెదవులబాధించి జిహ్వేంద్రియ ఘ్రాణేంద్రియములను వాయువునందుం జేర్చి ధ్యానింతు రిదియ తారకమంత్రము. త్రిలోకపూజితుండైన నారదమహర్షివలన నేనును నావలన నీవును యీరహస్యమును దెలిసికొంటివనిపలుక, శశిబిందుకుమారుండు హర్షపులకితగాత్రుండై ధన్యుండనైతినని కృతజ్ఞతా పూర్వకాభివందనముల నర్పించి ధ్యానముద్రం దాల్చి తారకమంత్రము జపించుచుండెను.

ఈరీతిగా నిశ్చలచిత్తుండయి, ఏకాగ్రముగ ధ్యానించుచున్న శశిబిందు రాకుమారునకు యిష్టకామ్యార్థసిద్ధి గావింపనెంచి, యింద్రాది దిక్పాలకులు శుకమహర్షి యాశ్రమమున కొక హయమును బంపిరి. ఆమహర్షి యాయశ్వము నిందులకు పంపెనని దివ్యదృష్టిం గ్రహించి, "వత్సా! ఈవారువము నారోహించి, ఖేచరమార్గగామివై మలయ ద్వీపమునకరిగి, యాజగన్మోహినిం బెండ్లియాడుమన వారాజనందనుం డానందకందళిత వదనాంబురుహుండై, యాఋషి సెలవుంగైకొని యా యశ్వము నెక్కెను.

ఆఘోటకము వాయువేగమనోవేగములం బ్రయాణము సల్పి యారాకొమరునిమలద్వీపమున జగన్మోహినియున్న సౌధమునదింపెను. ఆయశ్వము నొకచోం గట్టివైచి, శశిబిందురాజసూనుండా దివ్యసౌధ సోపానములపైం గాలిడి, "అమ్మో! ఈరక్కసి యొకవేళ నీసౌధమున నున్నదో, నేమి కీడు మూడునోకదా" యని శంకించుచు, నెట్టకేలకు గుండె దిటవు చేసికొని లోనికేగెను. ఒక గదిలో రక్కసి భయంకర ముగ గుఱ్ఱుపెట్టుచు నిద్రించుచుండెను. ఆరాక్షసి గాఢనిద్రాపరవశయై యుండుట గమనించి, మఱొక మందిరములోని కరిగెను.

జగన్మోహిని హంసతూలికాతల్పముపై శయనించి నిద్రించుచుండెను. ఆమె లావణ్య సౌందర్యముల నాలోకించి, శశిబిందు రాజకుమారుండు మూర్ఛాగతుండాయెను. అచ్చటనే పంజరబద్ధమై యున్న కీరము నూతనాంగతుండగు నొకండు మందిరమునం బ్రవేశించుటం దిలకించి, ఆవేశములో "అక్కా అక్కా" యని లేపెను.

జగన్మోహిని మేల్కాంచి, తన యెదుట నవమోహనాకారుం డగు సుందరుండుండుటకు విస్మితయై "అయ్యా! నీవెవ్వ"రని ప్రశ్నింప నాతండు తన వృత్తాంతము నెఱింగించి, "ఓసుందరీమణీ! నీసహోదరి భద్రావతి నాయన్నగారికి వివాహముచేయం బడినందున మనమిరువు

తమును బాధగులము. నీసౌందర్యము నావదేనవలన నాకర్షించి కేళీమలాలసుఁడనై యాపదశంకింపక తెగువతో నిచ్చటి కేతెంచితి" ననెను.

రామచిలుక "అక్కా! ఈనవమన్మథుని పెండ్లియాడు" మనెను. జగన్మోహిని "రామన్నా! ఈతని జేరియుంతును. పరిణయంబగుదు కాని రక్కసిచూచినచో నేమియాపద యాడునో కదా! ఏమిచేయుదు"నన, నాచిలుక మరల "నక్కా! అంతమాత్రమునకే యింతగా దిగులొందవలయునా? ఉపాయము లేకలేదా? రక్కసి యాహార సంపాదనమునకై యిప్పుడే వెడలఁగల దాతవఱకు నీతని నొకగదిలో నుంచు"మన, నాజగన్మోహిని యట్లే యొనరించెను.

రాక్షసి నిదురనుండి మేల్కొని జగన్మోహినినిముద్దుపెట్టుకొని యాహారసంపాదనార్థ మరణ్యములకుజనెను. వెంటనే ఆజగన్మోహిని శశిబిందురాజసూనుని పన్నీటజలకమాడించి నూత్నవస్త్రముల ధరింపజేసి పంచభక్ష్యపరమాన్నములతో భోజనమిడెను. రాజనందనుం డాలావణ్యవతిని గాంధర్వవిధింబరిణయంబై శృంగారసామ్రాజ్యసౌఖ్య భద్రిలవలె కాలముగడపుచుండిరి.

శశిబిందు రాజనందనుఁ డిట్లు రెండుమాసములు మహానందముగ గడపి యొకనాఁడు విషణ్ణవదనుఁడై "ప్రేయసీ! ఈరక్కసిభయము నన్ను మిక్కుటముగా పీడించుచున్నది. మనమీమె బారినుండి తప్పించుకొని మనదేశమున కరుగవలయును. నేను బయలుదేరి చాల దినములైనందున నాతలిదండ్రులు, సహోదరులు, పదినెలు నాకై యాందోళిత చిత్తులయియుందు"రని పలికిన నాజగన్మోహిని తన పతియారాటమును రామచిలుకకు దెలిపి విచారించెను. ఆచిలుక "అక్కా! విచారింపకుము. నిన్ను ముద్దిడుకొని లాలించునపు డుపా

యమున నా రాక్షసి ప్రాణమర్మములను తెలిసికొనుము. తక్కుంగల కార్యభారము నాపైనిడికొని నేను చక్క చేయుదు"ననియెను.

తక్కసివచ్చి, జగన్మోహినిని ముద్దుపెట్టుకొనుచుండగా నామె నయనములనుండి, దుఃఖాశ్రు బిందువులు జాలువాఱెను. అదిచూచి, రాక్షసి, "తల్లీ! నీవేల కన్నీరు విడుచుచున్నావు. నీకేమి లోపము కలిగినది. నివసించుటకా దివ్యసౌధమున్నది. కాలక్షేపమునకా చక్కని రామచిలుకయున్నది. ధరించుటకా చీనిచీనాంబరములు, వజ్రములు, రత్నములు సమర్చఁబడిన దివ్యహారములు నున్నవి. ఇంక నీకేమి కావలయునో చెప్పుము తల్లీ! నీమృదుల కపోలనుండి విచారాశ్రుధార స్రవించుట నేను చూడనొల్లనని పలుక జగన్మోహిని గద్గద కంఠమున నిట్లనెను.

"అమ్మా! సౌఖ్యవిషయములో నాకేలోపమును లేదు. నాకిచ్చట నుండుటకు మహానందదాయకముగనున్నది. నీవు ఆహారము తెచ్చుటకై యరణ్యమున కరిగినపుడే మృగము వలననైన నీకు హాని యొకవునేమోయనియు, నట్లు జరిగినచో నన్నీ నిర్జనమగు ద్వీపంబున కాపాడుట కెవరున్నారనియు సందియము తోఁచినపుడు డెందము వ్యస్తమగును."

ఆరాక్షసి జగన్మోహనుని నుద్దేశించి "అమ్మా! నీవు నాప్రాణములనుగూర్చి సంశయింపఁ బనిలేదు. నాప్రాణముల నయిదింటిని, అయిదు తుమ్మెదలుగా జేసి, యొక బరిణెలోనుంచి యీద్వీపము చివరనున్న దానిమ్మచెట్టుమీద నొక చిలుకదెంత గూటిలో నుంచినాను.

ఆచిలుక మరణములేనిది. నాచేతనే ప్రత్యేకముగా నాబరిణెను కాపాడుటకై నియమింపఁబడిన ఆసుకమున కెవరును హానికలి

గింపజాలరు. కావున చెల్లీ, నాజీవితమునకూర్చి భయపడకుము." అని పలికి మరల ముద్దు బెట్టుకొని వనమునకు బయలుదేరెను.

చిలుకతో జగన్మోహిని యీవృత్తాంతము దెలిపెను. ఆచిలుక బరిణను నోటఁ గఱచుట నభ్యాసముచేసి యొకనాఁటి యుదయమున బయలుదేరి యూరివెలుపల దానిమ్మచెట్టుమీఁదనున్న చిలుకను సమీపించెను. తనజాతిపక్షివచ్చినందులకు సంతసించి యారాజసి యొక్కచిలుక సంతోషాధిక్యమున కిలకిలారావము గావించెను.

జగన్మోహిని చిలుక బాంధవ్యమునటించుచు "అక్కా! నీవు సుఖముగానుంటివా? మనతల్లి మనల నిరువురను జన్మతనముననే విడదీసి నందున మనము యిన్నాళ్ళవరకును కలిసికొనలేకపోతిమి. మనతండ్రి నన్ను తనతోఁ దీసికొనిపోయెను. అతఁడు మరణించుటకుఁబూర్వము నీవిచ్చటనున్నావని చెప్పి యుపుడిపుడుచూచి రమ్మనిననేనువచ్చితి" నని పలికెను.

ఆచిలుక యిది నిజమేయని తలంచి "చెల్లెలా! నీవుచెప్పినదినిజమైయుండవచ్చును. నిన్ను నేనెన్నడును చూడలేదు. రమ్ము కూర్చుండుము. నీకు దియ్యనిఫలములదెచ్చియిత్తును. ఈ [illegible] నుమూల్యము జాగ్రతగాచూడు"మనిపలికి ఫలములతో వచ్చునంతలో జగన్మోహిని చిలుకతానుదెచ్చినబరిణెని గూటిలోనుంచి రాజసిప్రాణములున్నబరిణె తనదగ్గరనుంచుకొనెను.

ఫలములఁదిని మఱలనాల్గుదినములలో వత్తునని [illegible] చివ్వున నెగిరిపోయి జగన్మోహినిసౌధముంజేరెను. [illegible] డాబరిణెలోని తుమ్మెదలనయిదింటిని నలిపిచంపగా [illegible] లు పిక్కటిలునట్లొకకేకనైదిచనిపోయెను.

దేవతలు పుష్పవర్షము కురిపించిరి. శశిబిందు రాకొమరుఁడా చిలుకను జగన్మోహినిని అచటిమణులను వెంటబెట్టుకొని దేవతాశ్వమునెక్కి శుకమహర్షి యాశ్రమమున కరుదెంచి యాఋషికి నమస్కరించి మఱల పయనమై అంగదేశముంజేరి జననీజనకులకు సోదరులకు వదినెలకు ముదమొనగూర్చెను. చిత్రవాహనమహారాజు తనరాజ్యమును నాలుగువిభాగములుచేసి పట్టాభిషేకమహోత్సవమత్యంతవైభవముగ నొనర్చె"నని చెప్పిన నానందపరవశుఁడై పార్థుఁడర్ధనిమీలితలోచనుండై "బావా! నిదురనాపుకోజాల"ననియెను.

ఇరువురును నిద్రించిరి.

అయిదవకథ సమాప్తము.



## అవతారిక.

---

ఎప్పటియట్లు శ్రీకృష్ణుండును, కిరీటియు నదీతీరంబునఁ గూర్చుండి, ముచ్చటించుకొనుచుండఁగా నర్జునుండు, "బావా! వేదాంతములో నత్యంత నిగూఢమైన సచ్చిదానంద భావమును గుఱించిన కథను దెలిపి, నన్నానందభరితాత్ముం జేయవేయని పృచ్ఛసేయ, నప్పరమాత్ముండు దయాంతరంగుండై "పార్థా! నేఁటిదినంబున నీకు చంద్రగుప్త మహారాజు చరిత్రముం దెలిపెద నాకర్ణింపు"మని, ఇట్లు చెప్పఁదొడంగెను.

# చంద్రగుప్తమహారాజు కథ.

తొల్లి కేరళదేశాధీశుండగు విజయవర్మ మహారాజునకు సునీతి, వినీతి యను నిరువురు భార్యలు గలరు. వినీతికి కృతకీర్తి యను పుత్రుఁడు జన్మించెను. సునీతి యా కృతకీర్తిని తనకు బిడ్డలు లేనందున మిక్కిలి ప్రేమతోఁ బెంచుచుండెను. మఱుచటివత్సరమున నామె గర్భవతియై యొక సుతుం గనియెను. సునీతి వినీతిదేవుల పుత్రులగు చంద్రగుప్త కృతకీర్తు లిరువురును గ్రమముగా పెద్దవారైరి. వినీతి, తన సవతియగు సునీతికి బిల్లలు జన్మింపక పోయినచోఁ దన కుమారునకే పట్టము కట్టుదురని యాశించియుండుటచే, సునీతికిఁ బుత్రోదయమైనందునఁ దనవాంఛ నెఱవేఱక పోవుటచే మిక్కిలి చింతం జెందెను.

ఇట్లుండగా నాయిరువురు రాజనందనులును శస్త్ర శస్త్ర విద్యాకోవిదులై, యుక్తవయస్కులైరి. చిన్నభార్యయగు వినీతి, [illegible] చంద్రగుప్తునిం గడతేర్చి, తన కుమారుని రాజ్యాభి [illegible] నని యెంచి, యొకనాఁడు రాజు తన యంతఃపురమున [illegible] టికి తలకట్టుకొని, ఆభరణము లన్నియుఁ దీసివేసి [illegible] వచ్చి, చింతాక్రాంత వదనయై యున్న భార్యను [illegible] దెలుపు" మని యడిగిన నామె "నాధా! నాకు [illegible] నము [illegible] లిగినది. దుర్భరముగా నున్నది." యనెను. రాజు [illegible] తలకట్టుకొని యుండవలయునా? వైద్యులకుఁ గబురంప లేకపోతివా?" యనగా వైద్యులిది కుదర్చలేరు. నాకు ఆఁడుపులి పాలు తెప్పించవలయును. ఆపులిపాలు త్రాగినచో నీశిరోభారమంత రించు" నని పలికెను.

రాజు దేశమందంతటను "ఆఁడుపులిపాలు తెచ్చినవారికి బహుమానము ఈయబడు" నని ప్రకటించెను. ఎవరును దమ ప్రాణములమీదికి వచ్చు నపాయమునకు వెఱచి, యాపులిపాలను దెచ్చుట కంగీకరింపరైరి. వినీతి యనుదినము రాజును వ్యాఘ్ర క్షీరములఁ దెప్పింపుమని తొందరసేయుచుండెను. వినీతి "నాధా! మీపుత్రుల నిరువురం బిలిచి, ఎవరు వ్యాఘ్రముయొక్క పాలను దెచ్చెదరో వారికి రాజ్యమిచ్చెదనని చెప్పు" డనెను. తానుమాత్రము తన సుతుఁడైన కృతకీర్తితో రహస్యముగా "నాయనా! నీవరణ్య ముల కరుగక, ఎంతైన సంచరించి, పదునైదుదినములు గడచిన పిదప తిరిగిరమ్ము" అని చెప్పెను.

సునీతి తనయుఁడగు చంద్రగుప్తుఁడు తండ్రిపలుకుల నాల కించి, తల్లికడ కరిగి, సెలవిమ్మని యడుగ "నాయనా! ఇది నీసవతితల్లి కుతంత్రము. నిన్నామె యెట్లైనఁ గడతేర్పవలయునని యూహిం

చుచున్నది. నీవు పులిపాలను తేవలదు. నీకు రాజ్యమును వలదు. తిన్నగా కళింగదేశమునకుఁ బొమ్ము. తద్దేశాధీశుండగు నిందుశేఖర మహారాజు నీకు మేనమామ యగు నాతనికి దేవీకన్యామానముగ వెలుంగు నొక కుమారీ రత్నము కలదు. ఆకన్యామణిం బరిణయంబై, యచ్చటనే సుఖంబుగ నుండు"మని, దీవించెను.

చంద్రగుప్తుఁడు వస్త్రాభరణ శస్త్రసముచితుండై "అమ్మా! పౌరుషవంతమగు రాకులమున జన్మించి, పరభాగ్యోపజీవినగుట పాడి గాదు. వీరోచితముగఁ బ్రవర్తించి, పులిపాలను దెచ్చి, రాజ్యమును పాలింతు" నని వాక్రుచ్చెను.

ఇట్లని యాతఁడు కందినుంది భటులను వెంటనిడుకొని, భయ దకాంతారములఁ బయనము సాగించెను. అతనిననుసరించిన బలు వది మందియు క్రూరమృగములపాలఁ బడిరి. ఒకరిద్దరు ప్రాణములతో దప్పించుకొని రాజ్యమున కరిగి, చంద్రగుప్తుఁడు మార్గము తప్పి యెందేగెనో తెలియదని చెప్పఁగా విజయవర్మమహారాజును, సునీ తియు నత్యధికవిచారాందోళన భరిత హృదయులైరి.

చంద్రగుప్తుఁడట్లు భయంకరకాంతారములను గడచి, యొక ఋష్యాశ్రమముం జేరెను. ఆయాశ్రమము నందలి ముని యాతని యుదంతంబు సాంతముగ నెఱింగి "వత్సా! నీకుఁ బులిపాలు తెప్పించి యిచ్చెదను. నాయాశ్రమంబునఁ గొన్ని దినములుండు" మని చెప్పిన నాతఁ డట్లె యనెను.

ఒకనాఁ డాఋషి "వత్సా! నేను మనము దేవీపూజ యొనర్ప వలసియున్నది. మనకు నేను దేవీప్రత్యక్షమైకోరినవరముల నిచ్చునని పలికెను. ఆతనిమీద దయగలిగియున్న ధర్మదేవత ప్రత్యక్షమై "నాయనా! ఈఋషి నిన్ను నేను కాళీమాతకు బలియాయుదలంచి

యున్నాడు కావున జాగరూకుండవై మెలగుచు నాఋషిని కాళికాల యముంజేరగనే వధింపు"మనెను.

రాజకుమారుఁడగు చంద్రగుప్తుఁడును నాఋషియు ఫలకుసుమములంగొని కాళీయాలయమున కరిగిరి. ఋషి పూజానంతరము "రాజనందనా! దేవికి సాష్టాంగదండప్రణామము లాచరింపు"మన నాతఁడు "స్వామీ! నాకప్పవిధానము తెలియదు. కావున ముందుగా తాము చేసిచూపు"డనెను. ఆముని కుటిలహృదయముతో జయసవ్యాసవ్యచు సాష్టాంగముగ దండమిడుతఱి చంద్రగుప్తుఁడు తన దీర్ఘకరవాలముతో నాయోగిశిరస్సుఖండించెను.

కాళికాదేవి యారాజనందనునకు బ్రత్యక్షమై "వత్సా! కుటిలంతఃకరణుండగు నీయోగినిజంపి నాకానందము నొదవించితివి. నీకేమికావలయునో కోరుకొను"మనెను. చంద్రగుప్తుఁడు "తల్లీ! ఋషినిచంపి బ్రహ్మహత్యాపాతకము నొడిగట్టుకొంటిని. నాకీపాతకము నశించుయపవర్గమార్గముబోధించి పుణ్యముగట్టుకొమ్మని పలికిన దేవి సకరుణహృదయయై యిట్లనిపలికె—

"నాయనా! వేదాంతరహస్యములలో నత్యంతమహిమోపేతంబైన సచ్చిదానందప్రభావమును నీకిపుడు తెలిపెద నాలకింపుము—

"సత్తు + చిత్తు + ఆనందము సచ్చిదానందమగును. సద్రూపంబనియు, చిద్రూపంబనియు, నానందరూపంబనియు నాత్మకు మూఁడు రూపములు కలవు. సద్రూపమునకు త్వపదము, స్థూలమునను నామాంతరములును, చిద్రూపమునకు తత్పదము, బిందువు, సూక్ష్మమునను నామాంతరములును, అసిపదము, కళ, మకారము, కారణము నను నామాంతరము లానందరూపమునకును గలవు. స్థూలశరీరము పదునైదు తత్త్వములలో నొప్పుచు విశ్వపురుషుండన బరగుచున్నది. ప్రాణజ్ఞానేంద్రియములు పంచతన్మాత్రలనంబడును. మనో

బుద్ధులు రెండింటిలో గూడిన యీ సూక్ష్మశరీరము నైజమనుండని పెద్ద లచే వాక్రొనబడుచున్నది. శరీరము కారణ పురుషుడు ఆత్మారాము బ్రిహ్మము. అంతర్బహిర్వ్యాపకత్వమున చందాగ్ని ద్వయముగాక సప్త సముద్రములందు మూర్ఛ, జాగరణ, స్వప్న, సుషుప్త్యవస్థ విశిష్టా, షడాధారములను చుట్టుకొని నిత్య మిరువదియొక్క వేయిన్నూరు పర్యాయములు పలుకుచుండును.

గుదస్థానమును చతుర్దళములందు వ శ ష స యను చతుర్వర్ణము లలో ఓం బీజము కలిగి ఆధారకమలమున విఘ్నేశ్వరునకు ఆరువందల ప్రాణవమును, లింగస్థానంబున షడ్దళములలో బ భ మ య ర ల యీ షడ్వర్ణముల యందు బీజముగల సాధిష్ఠకమలమున బ్రహ్మకు ఆరు వేల ప్రాణవమును, నాభిస్థానమున దశదళములందు డ, ఢ, ణ, త, థ, ద, ధ, న, ప, ఫ, యీవర్ణములలో మణిపూరక కమలమున విష్ణుదేవున కారువేల ప్రాణవమును, హృదయస్థానమున పండ్రెండు దళములందు కఖగఘఙ చఛజఝఞ టఠ అను ద్వాదశవర్ణములు కలిగి అనాహత కమలమున పార్వతీధవునకు నాలుగువేల ప్రాణవ మును, కంఠస్థానమున షోడశదళములు కలిగి అఆ ఇఈ ఉఊ ఋౠ ఌౡ ఏ ఐ ఓ అం అః అను షోడశవర్ణములు కలిగి విశుద్ధకమలమున వేయి ప్రాణవము జీవునకును, త్రికూటస్థానంబున హం, క్ష యను వర్ణములతో ఆజ్ఞేయకమలమున నాత్మకు వేయి ప్రాణవమును, ఫాల మున రాం అను బీజము కలిగి సహస్రారకమలమున సద్గురు స్వామికి వేయి ప్రాణవమును—యీరీతిగా భాగింపబడి, యిడాపింగళనాములందు ప్రాణవాయురద్వయము పలుకును. ఆదిశేషుడధిదేవతగా దం అను బీజ ము కర్ణరంధ్రములతో నుండును. ఈఅష్టావధీమంత్రము ధ్యానించుచు హంసను ప్రాణాయామముచే రేచించిన పాముకు రాక పుట్టించుచు, దశవిధనాదముల నావిర్భవింపఁజేయుచు, నాలకించుచుండిన జ్ఞానాన

లము పాపరాసులం బటాపంచలగునని తలిక ఆర్త బ్రిహ్మలకు భేద ము లేదని తలుక వారల దానందవికసితాత్ములై కాళికాదేవి యొక్క సంపూర్ణానుగ్రహమున తదధ్యానము చేయుచు వాల్మపూపముల గనెను.

ఒకనాడు చంద్రగుప్తుడరణ్యమున ఫలములకొఱకై కొంత దూరముపోగా బాటసారులు కనిపించిరి. ఈతడు "పాంథులారా! మీ రెచ్చటి కేగుచున్నా"రని ప్రశ్నింప వారు "అయ్యా మేము కళింగ దేశమునకరుగుచున్నాము. మారాజగు నిందుశేఖరమహారాజు కేరళ దేశమహారాజుగారి కుమారుడైన చంద్రగుప్తునికి తనకుమార్తెయైన అమృతవల్లినిచ్చి వివాహము చేయదలంచియున్నాడు. మేమాతనికై వెదకుచున్నా"మని చెప్పిరి. అదిగాక మారాజేంద్రుడు తనకుమార్తె కిపుడు స్వయంవరము చాటియున్నాడు. అదికూడ దేశదేశముల బ్రక టించివచ్చుచున్నాము" అనిచెప్పి వెడలిపోయిరి.

చంద్రగుప్తుడు అమృతవల్లి తనయెడ బద్ధానురాగయైయున్నదో లేదో కనుగొన దలంచి కాళికాదేవిని దలంచి వృద్ధునివలె దయార్త్రై దివ్యవస్త్రాభరణములనుగొని యొకయుత్తమాశ్వము నెక్కి బయలు దేరి కళింగదేశముంజేరి స్వయంవరమండపముంజేరెను. ఎల్లరు నీతని వికారరూపముంగని నవ్విరి. చంద్రగుప్తుడు "రాజేంద్రా! నేను మీ రాజ్యమున కవ్వలనుండు వనదుర్గమున కధిపతిని. నన్ను వనరాజందు రు. నీకుమార్తెస్వయంవరవార్త వాలకించి నేనరుదెంచితి"నని యాతడు పర్పరిచిన శుకయంత్రలక్ష్యముం భేదించి కీర్తికాముడయ్యెను. ఎల్లరు విస్మయాంబుధిమగ్నమానసులైరి. ఇందుశేఖరమహారాజు తనకుమా ర్తెను వనరాజున కీయవలసివచ్చెగదాయని మిక్కిలి విచారించెను. అ మృతవల్లి పూలమాలను వృద్ధరూపముననున్న చంద్రగుప్తునికంఠసీమ

నలంకరించెను. రాజులెల్లరు విచారభరితాంతరంగులై తమతమదేశములకు వెడలిపోయిరి.

వివాహమయినదుదినములును గడచినపిదప నమృతవల్లి చంద్రగుప్తుని శయ్యాగారమున గలిసెను. చంద్రగుప్తు డాభీతహరిణాక్షిని జేరంజేరి "ప్రేయసీ! నేను వృద్ధుండను నావలన నీకెట్టిసుఖములును గలుగజాలదు. సుందరుడైన యువకుని బొందుగోరి సౌఖ్యార్ణవతరంగముల నోలలాడు"మని పలికిన నామె "నాథా! ఇవేటిమాటలు. అగ్నిసాక్షిగా మిమ్ము వివాహమాడినయేనెట్లన్యుల గోరుదును?" అనియెను. అంత నాతడు "ప్రేయసీ! నీవు కేరళదేశరాజనందనుడైన చంద్రగుప్తుని ప్రేమించితివట నిజమేనా?" యనిపలుక నామె "నాథా! మీకు సతినై అన్యునిపేరుతలచుట పాతివ్రత్యభంగమగును. మొదట నేనాతని బ్రేమించియున్నమాట వాస్తవము. అతడు పులిపాలకై బయలుదేరి వనముల కరిగినాడట. అతనిజాడ తెలియక నాతలిదండ్రులు, నాతనితలిదండ్రులును కూడ విచారమునొందుచున్నారట." యనిపలుక చంద్రగుప్తుడు "ప్రేయసీ! నేను వేటకుబోయివత్తు నాతని వెదకి తెచ్చెద"నని మఱునాడు వేటకుబయలుదేరి వనమునకరిగి కాళికాదేవిం దలంచుకొని నిజరూపము ధరించెను.

మూఁడు దినములైనను తన నాథుఁడు తిరిగి రాకుండుటకు విషాదమునొంది అమృతవల్లి తండ్రితోఁ జెప్పి పదిమంది భటులరణ్యమునకుఁ బంపెను. ఆభటులు కాననమునకు బోవగనే, చంద్రగుప్తుఁడు కనబడి "అయ్యా! మీరెందుఁబోవుచున్నా"రని ప్రశ్నింపఁగ, వారు "మారాజనందని భర్త వేటకై వనమునకు వచ్చి నాతని వెదకుటకు మేమేగుదెంచితి"మని పలుక చంద్రగుప్తుఁ "డయ్యా! ఆవృద్ధుఁడొక సింహమున కాహార" మయ్యెననియు [illegible]

గుప్తుఁడనియుఁ బలికి వారితో నగరమునకుఁబోయి, అమృతవల్లిని గలిసికొన "సఖీ! ఇంతదూరము నీకొఱకై గదా! నేను వచ్చితిని. వచ్చినట్లు మోసగింపనగునా?" యని పలుక నామె "మీరు కనబడ కుండుటనే నాతండ్రి స్వయంవరము చాటించెను. నాభర్త లేని జీవిత మేల. నాతని శిరము కాన్పించినంతనే సహగమనముఁ జేయుదు" నని పలుక, చంద్రగుప్తుఁ డామె పాతివ్రత్యభావమున కానందించి మరల నిందుశిరస్సు చేత బ్రీత్యుత్సుకుఁడై "కామినీ! నాతో స్వర్గలోక మునకుర" మ్మనిన నామె "అయ్యా! నాపతి మృతకాయము గోచరించినంతనే సహగమనము చేయుదు" నని పలికిన, నాతఁడు మఱల వృద్ధునివలెఁ గాన్పించి, "ప్రియసీ! నేనే! చంద్రగుప్తుఁడను. నేనే యింద్రజాలములో నీకడ కేతెంచితి" నని యిందుశేఖరమహారాజు సమ్ముఖమున నావేషములఁ బ్రదర్శింపగా నాతఁ డాశ్చర్యభరితుఁడై అల్లుని కౌగిలించుకొనెను.

చంద్రగుప్తుఁడు తన సతీమణినిఁ దీసికొని, మరల సపరివారముగా కేరళదేశమున కేగెను. ఆతని తల్లి సునీతియు, తండ్రి విజయవర్మయు, సవతితల్లి వినీతియుగూడ నానందసాగర తరంగమాలల నోలలాడించె" నని చెప్పగా నగ్రజుఁడు "బావా! నిద్రవచ్చుచున్నది" అనెను.

ఇరువురును నిద్రావశవశులైరి. మలయమారుతము వీచి, వారిని జోకొట్టి, గాఢనిద్రావివశులఁజేసెను.

ఆరవకథ సమాప్తము.



## ౫దవ కథ.

---

శ్రీకృష్ణార్జును లెప్పటియట్ల యమునానదీతీరంబున సుఖ విష్టులైయుండ, కృష్ణపరమాత్మ "అర్జునా! నీకు నేడు మహానంద ప్రదమగు రాజహంసమహారాజుకథం జెప్పెదనని యిట్లు చెప్పనారం భించెను.

# రాజహంసమహారాజుకథ.



తొల్లి కాంభోజదేశంబున విశ్వజిత్తనురాజు పరిపాలించు చుండెను. ఆతనికిఁ జంద్రావతి, కుసుమాంగి యను నిరువురు భార్య లు కలరు. పెద్దభార్య యనిన రెండవభార్యయగు కుసుమాంగి కెంత మాత్రమును గిట్టదు. ఆరాజున కిరువురుభార్యలకును యిరువురు కుమారులు కలరు ప్రథమభార్య కుమారుని పేరు రాజహంసుఁడు రెండవ యామె తనయుని నామధేయము చిత్రగుప్తుఁడు.

ఇరువురును గురుముఖంబున సకలవిద్యలను నభ్యసించిరి. రాజు మొదటికుమారునకుఁ బట్టాభిషేక మొనరించి, విశ్రాంతిపొంద నభిలషించెను. లోకోత్తర సుందరుఁడగు రాజహంస కుమారుఁడు మహారాజగుటను వార్త దేశంబునఁ బ్రకటితంబయ్యెను. ఎల్లరు సా

స[illegible]రికాంతఃకరణులైరి. సవతికొడుకు ఎట్లైన సింహాసనాసీనుం [illegible] వలెనను కుతూహలముగల కుసుమాంగి, రాజహంసునిపై మహారాజునకుఁ గ్రోధము వచ్చునట్లు చేసి యాతనిని రాజ్యమునుండి వెడలనడప నాలోచించి, తలకట్టుకొని, ఆభరణ విహీనయై, [illegible] చించుకొని, గాజులను, హారములను, దీసివైచి, శయనించెను.

రాజు వాహ్యాళి వెడలి యింటికి దిరిగివచ్చి వెక్కి-వెక్కి-యేడ్చుచున్న సతిని దిలకించి "ప్రియసఖీ! నీవిచారమునకు గారణమేమి? నాతో దెలుపుము. నీవిచారమంతరింపఁజేయుదును. నీకేమికావలయునో కోరుకొను"మనియెను. ఆమె బిగ్గఱగా రోదనముచేయుచు "నాథా! మీకును నాకును నేటితో ఋణముదీరినది. నేనింతవఱకును నీవే నానాథుండవని తలంచియుంటినికాని నీప్రథమభార్యకుమారుడు నన్నింతింతనరాని అల్లరిపాల్జేయుచుండెను. అతఁడే నాకు నాథుడట. నీకు అతనిపై ప్రేమమెందు. నేను భరింపజాలని పలుకు లాతనినోట వెలువడినవి. నన్నాతడు మోహించినాఁడట. నాపొందుగూడని యాతనిజీవితము వ్యర్థమట. ఏమిచెప్పనుశ్రీ ఆతనిపలుకులు వినజాలక తుదకు పాతివ్రత్యమే భంగమగునేమోయని భయపడి ఉద్యానవనములోనికి బరుగెత్తితిని. ఇక నేను జీవింపజాలను. ఈపరాభవము నన్నునిలువున దహించివేయుచున్నది. ఏమైనను నీపెద్దకొడుకు నీకుంగడుముద్దుముకూర్చువాడు. నేనింక విషముండ్రావి మరణింతు"నని పలికెను.

రాజు క్రోధోన్మత్తుండై "అతఁ డెప్పుడు నీసౌధమున బ్రవేశించె?"నని ప్రశ్నింప నామెయేడ్చుచు "నిన్న సాయంకాలమున"నని చెప్పెను. అవిఘ్నజిత్తుమహారాజంతట "సరే. నిన్న వమానపఱచిన యాతఁడు కుమారుడైనను దండింపబడవలసినవాఁడే. తల్లినే బలాత్కరించిన యాతుని వధ్యుఁ"డని కోపోద్రిక్తుండై రయమున భటులంబిలిచి "రాజహంసుని తెల్లవారకముందు ఊరివెలుపలనున్న వధ్యశిలకడకుఁగొంపోయి వధించు"డని యాజ్ఞాపించెను.

ఈపలుకులను రాజుగారి చిన్నభార్య కుసుమాంగి చెలికత్తె యగు మాలతి చాటుననుండి విని, రాజహంసునిపై నభిమానముగల దగుటచే బిరాన నాతని యంతఃపురముం జొచ్చి "రాజకుమారా! లెమ్ము. త్వరపడుము. నీసవతితల్లి నీవు పట్టాభిషిక్తుండవగుదువని మత్సరగ్రస్తయై తన్నుకామించి బలాత్కరించితి" వని చెప్పగా రాజేంద్రుఁ డత్యధిక కోపపరీతచిత్తుండై నిన్ను సూర్యోదయాత్పూర్వము వధింపు"మని యానతిచ్చె. బ్రతికియుండిన బలుసుకూరఁ దినవచ్చు నన్నట్లు నీవెందైనఁ గొన్నాళ్ళు ప్రచ్ఛన్నంబుగ సంచరించి, తిరిగిర"మ్మని పలుకుటయు, నాతఁ డెందులకైన మంచిదని యాభరణముల నొక మూటగాకట్టి, ఆయుధసహితముగఁ దన తల్లిసెలవుఁ గొని ఎరికిని దెలియకుండ నర్ధరాత్రమున నగరము వీడి చనెను.

తెల్లవారెను. రాజహంసుఁ డెందు వెదకినను కానరానందున రాజు మతింతయుగ్రుండై మండిపడుచు నాతనిం బట్టి వచ్చి చెప్పిన వారికి లక్షవరహాలు బహుమానముగ నొసంగెదనని ప్రకటించెను. ఇచ్చట నీతఁడు తిన్నగా గిరికందరములను, నదీ నదములను గడచి

యొకచోట నొక యరటి చెట్టును జూచెను. ఆయరటి చెట్టున కొక్కటే గెలయు, నాగెలకు నాలుగు పండ్లును నుండెను. ఆనాలుగు ఫలములను గోయగా మరి నాలుగు పండ్లు కనిపించెను. ఓహో! ఇది చాలవింతయైన వృక్షముగ నున్నదే యని, రాజహంసుం డొకపండు భక్షింపగా శునకరూపము కలిగెను. రెండవపండును దినగా స్త్రీ యయ్యెను. మూఁడవపండును దినగా కోతియయ్యెను. నాలుగవ పండును దినగా మరల యథాప్రకారముగ నిజస్వరూపమును బొందెను.

రాజహంసుండా యరటిచెట్టున నప్పుడు కనబడిన నాలుగుఫలములను గోసికొని బయలుదేఱెను. కొంతదూరము పోవునరికి కొందరు దొంగలాతని నడ్డగించిరి. ఆతఁడు తనవద్ద ద్రవ్యములేదని చెప్పి మొదటియరటిపండును తినుటకిచ్చెను. ఆయరటిపండును తిని నలువురు శునకములుగా మారిరి. రాజహంసుఁడా శునకములతోఁ గొంతదూర మేగగా నొక సన్యాసి కాన్పించి "అయ్యా! నాకొక కుక్కనిమ్ము. నాయాశ్రమమును గోతులు మిక్కిలిగా పాడుచేయుచున్న"వని చెప్పెను. రాజహంసుఁ డాశునకము నామునికిచ్చి తలచినంతమాత్రమున రెండువేలమంది సైనికులను సృష్టింపఁజేయు మహామంత్రము నుపదేశమంది, కొంతదూరము పోయిన పిమ్మట మువ్వురు స్త్రీలుగా జేయు నరటి పండును దిననిచ్చి మరికొంత దూరము పోయిన పిదప నొక వరము నొక ఋషివలన పొంది యొక స్త్రీనిచ్చి మఱొక స్త్రీనిచ్చి యమోఘాస్త్రములను నొక కరవాలమును గొని యామువ్వురను వదల్చుకొని తిన్నగా పోయిపోయి యొక ఋష్యాశ్రమముం జేరెను.

ఆయాశ్రమము నందలి మతంగమహర్షి రాజహంసునింగని "వత్సా! నీకు వేదాంతములలో నత్యంత వినిగూఢమైననిరాకారబ్రహ్మ భావముం దెలిపెద నాకర్ణింపుము. శరీరములన్నియు సాకార బ్రహ్మ స్వరూపములే యగును. తలిదండ్రుల శుక్ల శోణితమువలన జన్మించి వారివలన బోషింపబడి పిదప గురుముఖంబున బ్రహ్మస్వరూప నిర్ణయముం దెలిసికొని, పూజార్హులయిరి. అర్చన వందనాది పూజలు తల్లిదండ్రులకుఁ దైవమునకుఁ జేసినవే ఫలించును గాని, దారు లోహ శిలాప్రతిమలకుఁ జేయు పూజ నిష్ప్రయోజనకరము. శివ కేశవమంత్రములు తమ గురువులనుండి గ్రహించి, శ్రద్ధతో నంత ర్ముఖుండయిన ప్రాణవాయువుతో మనస్సును నిలిపి, దృగ్భావములను లింగస్థానంబున నిల్పి చతుర్ముఖ బ్రహ్మను నాభిస్థానమున నిలిపి, విష్ణుదేవుని హృదయ పీఠమును నిలిపి, ధ్యానించిన యెడల యిష్టసిద్ధి యగును.

ఇట్లని నారాయణాష్టాక్షరీమంత్రమును 'ఓంనమోనారాయణా యనుమంత్రము జపించుమని చెప్పెను. ఆబుష్యాశ్రమమున నొక్క సం వత్సరము జపింపగా నతనికిష్టకామ్యార్థసిద్ధియగుకాలము ప్రాప్తమగు టచే గొందఱు బాటసారు లాశ్రమమార్గమున నరుగుట తటస్థించెను ఆబాటసారులనుచూచి "ఓబాటసారులారా! మీరెచ్చటికేగుచున్నారు?" రని ప్రశ్నింప "అయ్యా! మేము మాళవదేశవాసులము మారాజ్యము ను శత్రువులు ముట్టడించుటచేతను మారాజసహాయుడై మమ్ము ర క్షింపక యూరకుండుటచేతను మేము రాజ్యమును విడిచివచ్చితి"మ నెను. ఆరాజహంసుండెట్లయిన నారాజ్యమును శత్రుహస్తగతముకా కుండ రక్షింపనెంచి "ఓపౌరులారా! మీరాజ్యమును నేను రక్షింతు ను. నన్ను ఎట్లయిన పురిలోనికి గొనిపోవు"డన వారుప్రముదితాత్ము

లైరి. రాజహంసుడు కాషాయాంబరములవీడి వస్త్రాభరణముల ధరించి తిన్నగా పురమునకు బోయెను. ఆతడు రాజాంతఃపురమును జేరి విక్రమసింహమహారాజునుగని "రాజా! నీ రాజ్యమును శత్రువులపాలు చేయవలదు. నీకున్న కొలది సైన్యమునకును నేను నాయకుడనై సంగ్రామ మొనరించివత్తు"నని పలికి సేనను వెంటబెట్టుకొని యుద్ధరంగమున కరిగెను.

అతనింజూచి, వైరు "లితఁ డెవ్వఁడు? ఇచ్చటి కేకారణమున రావలయు? "నని యాశ్చర్యపడి యుద్ధమునకుఁ దలపడిరి. ఆరణమున రాజహంసుం డవక్రపరాక్రమోపేతుండై విజృంభించి వైరుల నెల్లర నొక్కత్రుటిలో నిశ్శేషముగ వధించి, శత్రువులను దఱిమివేసి, విజయోత్సాహముతోఁ బురజనులెల్ల యూరేగించుచుండ కోటకరుదెంచెను. విక్రమసింహమహారాజు తనరాజ్య మన్యాక్రాంతముగా లేదని యానందించి, తన రాజ్యము నాతని కొసంగి, పట్టాభిషేకము గావించి తాను తపోవృత్తినుండుటకు వనముల కరుగఁ బోవుచు "నాయనా! నీవు మాత్ర మూరివెలుపల నున్న కాళికాలయమునకుఁ బోయి యాతలుపులఁ దెఱువకు మపాయము కలుగ గలదని చెప్పి వెడలిపోయెను.

రాజహంసుండు మాళవదేశాధీశుఁడై జనరంజకముగా రాజ్యపాలన మొనరించుచుండెను. ఆతనికి మాత్రము విక్రమసింహుఁడు వలదన్న విషయమే విస్మయదాయకముగా నుండుటచే నెట్లయిన యొకసారి ఆదేవాలయమును జూచి వచ్చుటకై, మంత్రులతోఁ గొలఁది దినములలో వత్తునని మిషచెప్పి, ఆయుధముల ధరించి, వెడలెను.

రాజహంసుండా కాళీదేవాలయము తలుపులు తెఱువగానే యొక దివ్యాంగన ప్రత్యక్షమై, యారాజ కుమారుని చేయిపట్టుకొని లోనికిఁ దీసికొనిపోయెను. రాజహంసుఁ డేమిజరుగునో యని యామెతో లోనికిపోయెను. అతఁ డొక సొరంగమునుండి చాలదూరము గొనిపోఁబడెను. అది యొక పట్టణము. ఆమె యొక రాణియొద్దకా రాజహంసుని గొనిపోయెను. "ఈతఁడిట్లు మనలోకములో ప్రవేశించినాఁడు వీనిని కారాగారమునఁ ద్రోయుఁ" డనెను.

రాజహంసుని విచారమునకుఁ బారము లేదయ్యెను. ఆరాజేంద్రుని పలుకులు పెడచెవినిఁబెట్టి వచ్చినందులకుఁ దగినశాస్తియైన దనియా రాజసూనుఁడు పశ్చాత్తాపము నొందెను. ఆతని కొక యెలనాగ బంగారు పళ్ళెరములో వివిధరుచ్య పదార్థములతోఁ గూడిన భోజనమును దెచ్చిపెట్టెను. ఆతఁడా లతాంగి సౌందర్యమునకు నివ్వెఱవోయి, యాభోజనమును నిరాకరించి, విచారరేఖాంకితవదనుఁడై కూర్చుండెను. ఆతరుణీమణి యాతనిని సమీపించి, "ఓయీ! ఏల విచారించెదవు? మారాణి యిప్పుడు నిన్ను పిలిపించి విచారించును. బహుశః ఆమె నిన్ను విడిచిపుచ్చవచ్చును." అనెను.

రాజహంసుఁ "డయ్యో! ఇఁక నాకెక్కడి విమోచనము? నారాజ్యమున విప్లవములు చెలరేగును. నే నేమి చేయుదును. మీకు రాణియేగాని రాజులేఁడా?" యనగా, "మాకు రాణియే. ఆమె యింకను అవివాహితయైయున్నది. ఏరాజకుమారుఁడైన లభించినచో వివాహమాడఁ దలఁచి యున్నది. ఒకవేళ నిన్నుఁ బెండ్లియాడుదు నన్నచో సమ్మతింతువా? ఆమె యొకవేళ వివాహము చేసికొన్నచో నాకేమి యిచ్చెద" వని, "ఓవెఱ్ఱిదానా! నాకింకా ఏవో కబుర్లు చెప్పి జోకొట్టెదవేల? కారాగృహవాస శిక్ష తప్పించి, వధించు [illegible]

చూచెదమో యని భయపడుచున్నా" ననగా నామె మరల "నీ చెప్పి నది సత్యము. మారాణి మిమ్ము తప్పక వరించును. నాకేమి బహు మాన మిచ్చెదవు?" రన, నాతఁడు "నీకు నాప్రాణము కావలసినను నిచ్చెదను. తెల్పు" మనుటయు, నామె "రాజేంద్రా! నీసౌందర్య మునే నేను ప్రేమించితిని. మారాణియు నీయెడ ననురాగవతియైన దని యామె భావములవలన దెలిసికొంటిని. అట్టి యెడ చెలికత్తె నగు నాకును నీకును వివాహము సంఘటిల్ల నేరదు కావున దయాం తరంగుఁడవై నన్నుఁ జూచుచుండు" మన నాతఁ డట్లేయని యామె చేతిలోఁ జేయివైచి, తళతళలాడు నామె చెక్కిలిని నొక్క ముద్దాడెను.

ఇంతలో నొక పరిచారిక వచ్చి "రాణిగారు రమ్మన్నా" రనెను. రాజహంసుఁ డా పరిచారిక ననుసరించి, యొక దివ్యభవ నములోని కరిగెను. ఆరాణింజూచి రాజహంసుఁడు నిరతిశయా నందము నొందెను. ఆమె "రాజకుమారా! నీవు మారాజ్యంబున నక్రమప్రవేశ మొనరించి నందుల కేమి శిక్ష విధించవలెనా యని యోచించుచున్నాము. న్యాయశాస్త్ర మిట్టి శిక్షకు మరణము విధిం చుచున్నది. నీకును నదే విధింతుము. పాపము! నీకే కోరికలున్నవో తెలుపు మని నెఱవేర్చి, వధ కాజ్ఞాపింతు నిటు వచ్చి కూర్చుండుము" అనెను. రాజహంసున కాతనిం బ్రేమించిన చెలికత్తె కనుసన్న యొన రించి, వెడలిపోయెను. ఆతఁడు "రాజ్ఞీమణీ! నాదురదృష్టమే నన్ని చటి కీడ్చుకొని వచ్చినది కావున మరణశిక్షనే యనుభవింతును. ప్రాణములదక్క యన్యమేది వాంఛించినను నభ్యంతరమిడక యిచ్చె దవా?" యన నామె అట్లేయనెను.

రాజహంసుఁడు "రాజ్ఞీమణీ! నీయందము నన్నాకర్షించినది. నిన్ను గాంధర్వవిధిం బెండ్లియాడ ఒక్కరాత్రి నీతో సుఖింపనిమ్ము.

తేవటియుదయమున నే మరణశిక్ష ననుభవింతు''నన రాణికోపము నటించుచు "రాణి నిట్లుకోరరానికోరికల గోరుట తగునా?" యనగా నాతడు "నీయనుగ్రహము. సత్యనిరతి పాటింతువేని నాకు వాంఛ సిద్ధియగును. లేదేని వధింపు''మనెను.

ఆమె వల్లెయని యాతనిం బెండ్లియాడి "నీకు మరణశిక్షవిధించినచో నాకుదుఃఖమొదవుంగాన యాశిక్షరద్దుపఱచితిని" నెను. రాజహంసుం డామెను తనమాళవదేశమునకు రమ్మనియెను. ఆమె తన రాజ్యమునువీసి రాజాలసనియు నాతడే నాల్గైదుదివసముల కొక పర్యాయమువంతున వచ్చుచుండుట సమంజస''మనియు బలుక నాతడట్లేయని ప్రయాణసన్నద్ధుండయ్యెను. రాణియొక మంత్రదండము నొసంగి ''దీనితో ఎవరిని తాకినవా రదృశ్యులగుదురు. మూడుసార్లు కొట్టినచో మరల నిజరూపముంజెందుదు''రని కొన్ని వజ్రములనిచ్చి సాగనంపెను.

రాజహంసుండామంత్రదండముంగొని కాళికాలయమునుజేరి తననగరమునకు వచ్చునరికి మంత్రి యారాజ్యమును దనవశముచేసికొనియుండెను. రాజహంసుండు మంత్రిదుర్ణయము నెఱింగి యాతని కడ కరుగ నామంత్రి రాజ్యము సైన్యము తనస్వాధీనమునను్నపనియు శక్తియున్నచో రాజ్యమును యుద్ధమొనర్చి సంపాదింపవలయుననియు జెప్పెను. రాజహంసుండు మరల కాళికాలయమునుంజేరి పంచారికా సహాయమున నాయధోలోకమునకరిగి తనసతియగు రాణితోజెప్పి లక్షమందిసైనికులనువెంటబెట్టుకొనివచ్చి పురప్రవేశమొనరించి మంత్రిం బట్టుకొని కారాగారమున బడవైచి తానాసైన్యముతో కాంభోజదేశమును ముట్టడించెను.

రాజహంసుని తండ్రియగు విజయవర్మ పరిచారిక వలనఁ [illegible]కార్య[illegible] నెఱింగినవాఁడై, పశ్చాత్తాప తప్తుఁడై యుండి “అయ్యయ్యో! నాకుమారుఁడు రాజహంసుఁ డున్నచో శత్రువును దఱిమియుండునుగదా! యని వగచి, తుదకుఁ దానే సైన్యమును యాహవభూమికిఁ బొమ్మనెను. ఆసైనికుల నందఱ సమ్మోహనాస్త్రముం బ్రయోగించి, మూర్ఛానివశులఁ జేయుటచే, రాజే తెంచి, మూర్ఛాగతమైయున్న సైన్యమును గని దిగ్భ్రమకు లోనై యెదుట నున్న వీరుఁడు తన కుమారుఁడని గ్రహించి, యాతని చెంతకరిగి తన పశ్చాత్తాపమును వెల్లడింప రాజహంసుఁడు తన రాణినిఁ దలంచుకొని యామెను రప్పించి సుఖంబుగ కాలముంగడపె” నని చెప్ప కథ ముగించుసరికే యర్జునుండు నిద్రించియుండెను. శ్రీకృష్ణుండు కూడ నంతనిద్రించెను.

ఏడవకథ సమాప్తము.



## ఎనిమిదవ కథ.

ఎనిమిదవనాఁ డెప్పటియట్లు నరనారాయణాంశమున జన్మించిన శ్రీకృష్ణార్జునులు యమునా సైకతస్థలింగూర్చుండి వినోదంబులం బొద్దుపుచ్చుచున్నతఱి వాసుదేవుండిట్లు చెప్పదొడంగెను.

# చంద్రశేఖరమహారాజుకథ



తొల్లి సౌరాష్ట్రదేశమును విజయకేతుమహారాజు జనానురంజకముగా పరిపాలనమొనరించుచుండెను. ఆతనికి జయసేనుఁడు, వీరసింహుఁడు, చంద్రశేఖరుఁడు, నను మువ్వురు పుత్రులుండిరి. వారిలో మొదటి యిరువురికంటె మూఁడవవాఁడగు చంద్రశేఖరుఁడు అత్యంతధైర్యసాహసపరాక్రమోపేతుఁడై యనేక సాహసకృత్యములగాంచుచు పౌరులకెల్లరకు నేత్రోత్సవముకలిగించుచుండెను.

ఒకనాఁడు మువ్వురుసోదరులును మృగయావినోదార్థమై వన్యమృగసంకులంబగు నరణ్యంబునకుజనిరి. చంద్రశేఖరుండొక లేడినితఱుముచు నది దొరకక చెంగుచెంగున గంతులిడుచు పాఱిపోయినందున "ఆహా! దీని నెట్లయిన నాతో నింటికి గొనిపోవలె"నని తలంచుచు మఱింత దూరముపోఁగా నాహరిణమదృశ్యమయ్యెను. చంద్రశేఖరుండయ్యో! ఈకురంగమెట్లు నాకనుమఱగి పారిపోయిన"దని విచారించుచు ఆయాసఖేదంబవనయించుకొనుటకై యొకతరుచ్ఛాయను గూలఁబడెను, అతఁడట నుపవిష్టుండైయుండఁగా మాయమైపోయిన హరిణ

మొకసుందర నారీమణియై పుష్పములుకోయుచు దృగ్గోచరం బాయెను.

చంద్రశేఖరుండా కాంత యద్వితీయసౌందర్య లావణ్యముల కాశ్చర్య చకితుండై, యామెను సమీపించి, "ఓలలితాంగీ! నీవెవతె వీయుగ్రతహారణ్యంబునకు రాఁగతంబేమి" యని పలుక' "ఓరాజ కుమారా! పరనారీలలామల నిట్లు పలుకరింపఁ దగునా? నేను నాగేం ద్రుని కుమార్తెను. నాతండ్రి నాయీపవిత్రవనము నతిక్రమించిన, గుపితుఁడు కాఁగలఁ" డనిన, నాతఁడు "మత్తకాశినీ! నాడెందము నీయందఁ దగుల్గొనియున్నది. నే నన్యభామల వాంఛింపను. నీవు నా ప్రేమను పరిగ్రహింపవేని నేనిట నాయసువులఁ బాయుదు" నన నామె "రాజకుమారా! నీయందచందములుకూడ నన్నాకర్షించినవి. నేనేమి చేయుదును? నావెంట నాతండ్రిక డకురమ్ము. అతని యంగీ కారముఁగైకొని, నన్ను పరిణయం బగుదువుగాని" యనెను. చంద్ర శేఖరుఁ డాతన్వి ననుసరించి బయలుదేఱెను. వారిరువురును పుట్టను సమీపించిరి. ఆతరుణి యాతని నచ్చటనే యుండ నియమించి, తాను ఆవల్మీకమునుజేరి యందు బ్రవేశించెను. కొలఁది క్షణములు గడచిన పిదప నావల్మీకమునుండి సర్పము భయంకరముగా బుస్సు బుస్సు మనుచు నీవలి కరుదెంచిన, చంద్రశేఖరుఁడు భయకంపితుఁడు గాక, యాసర్పమునకు నమస్కృతు లొనర్చి నిలువఁ బడిన, నాభుజంగము మానవ సహజమగు కంఠస్వరమున నిట్టులనెను.

"ఓయీ! రాజకుమారా! నీవునన్నుచూచి భీతచిత్తుఁడవుగాకు ము. నేను నీకపకృతిసేయువాడగాను. నేనొకగంధర్వుండను. శాపగ్ర స్తుండనై యారీతిగా సర్పరూపమును బొందవలసివచ్చినది. నీవు వెం టనే ఘూర్జరదేశమునకు బొమ్ము. ఆమహారాజు కుమార్తె కనకాంగి

చిక్కలి రూపవతి ఆమెస్వయంవరము దేశమందంతటను జాటింపబడినది. ఆస్వయంవరమున నొకఝిల్లికాయంత్రము నిర్మింపబడినది. దానిని గొట్టినవానికి తనకుమార్తె నిచ్చి పరిణయము జేయుదునని యారాజు ప్రకటించినాడు. నేను నీకొక బాణమునిచ్చెద నాబాణము సాయమున నాయంత్రముం గొట్టి యామెను బెండ్లియాడి యాబ్రాహ్మణుడులతో నిచటికివచ్చి నీవును నీసతియు నాపడగపై జేతులుంచుడు. అప్పుడు నేను నిజరూపము జెందుదు''నని యెను

చంద్రశేఖరుండంతట నాశరములఁగైకొని తిన్నగా ఘూర్జరమునకు బోయెను. అచ్చోట వివిధదేశాధీశులగు మహారాజులు ఆయంత్రము ఛేదించుటకై యరుదెంచి నిరాశాహతులై యూరకుండిరి. వారింగని యాతడధైర్యముం జెందక నాయంత్రమును బరీక్షించి యెల్లరు విస్మయాంబుధిమగ్నమానసులగునట్లు లక్ష్యమును ఛేదించెను. సుందరాంగుడు నవమోహనాకారుడునగు రాజసూనుడు లక్ష్యము ఛేదించుటగాంచి నిర్భరానందభరితస్వాంతయై యాతనికంఠసీమను బూలహారము గీలించెను. మహారాజు కనకాంగికిని చంద్రశేఖరునకును డెబ్బదియోగంబులఁ బెండ్లి చేసెను. అయిదవరేయి నత్యంతమనోహరముగ నలంకరింపబడిన శయ్యాగృహమునకు దనయర్ధాంగియగు కనకాంగి యరుదెంచినపిదప నాతడామెను తాకక సర్పముయొక్క వృత్తాంతము నెరిగించెను. కొన్నిదినములెట్లోగడపి చంద్రశేఖరుడు తన రాజ్యంబున కరిగెదనని మామగారితో జెప్పి యాతనివలన ధనకనకవస్తువాహనంబుల బహుమానముగావడసి కనకాంగిని వెంటనిడుకొని పయనమై కతిపయదినములకు వల్మీకలమునుజేరి ధ్యానించినంత నాభుజంగమీవలి కరుదెంచెను. ఆసతీపతులిరువురు నాపాముపడగపై జేయివైచిరి. వెంటనే యాపాము గంధర్వరూపమంది యాదంపతుల విస్మితులనొనరించెను.

ఆగంధర్వుఁడు "రాజకుమారా! నీవలన నాకు శాపవిమోచనమైనది. నేను వెనుక నొకపర్యాయము మర్త్యలోకమున సంచరింప వరుచెంచి, తపస్సుచేయుచున్న యొక ఋషింగాంచి, యొక త్రాచు నాతనిపై విసరి 'పాము పా'మని యరచితిని. ఆఋషి తపస్సునకు భంగమొదవెనని యాగ్రహించి నన్ను "నీవు సర్పము వగుదువుగాక" యని శపించెను. నేను వేడగా, నతఁడు కరుణాంతరంగుఁడై నీవలన శాపవిముక్తి యగునని తెలిపి యంతర్ధానము నొందెనని పలికి, వల్మీకములోని దివ్యమణులను బహుమానముగా నొసంగి, "వత్సా! నీకింక నేమైన కావలయునా?" యని ప్రశ్నింప, చంద్రశేఖరుం "డయ్యా! గంధర్వులు మహావిజ్ఞాన సంపన్నులని వాడుక. నాకుభక్తి యోగము నిరాకార ప్రభావమును, మోక్షమార్గమును దెలిపి పుణ్యము కట్టుకొమ్మనిన, నాగంధర్వుం డిట్లు చెప్పదొడంగె.

వత్సా! భక్తియోగము వేదాంత ప్రపంచమున నత్యధిక ప్రాముఖ్యముగలిగి వెలయుచున్నది. జగత్తున జన్మించిన ప్రతిమానవునకును భక్తి యనునది యుండవలయును. భక్తిలేకున్నచో మానవుని కేవిషయమునను గూడ దైవ సాహాయ్యము లభింపనేరదు. భక్తి గలిగియుండి, తదారాధనకు శక్తిలేక యున్నను పరమాత్ముఁడు సంప్రీతుండగును. ఇంద్రియ నిగ్రహము కలిగి, భేదభావరహితమైన హృదయములో అవినాశకము, రూపరహితము, సర్వవ్యాప్తము నచలము నగు పరబ్రహ్మ నెవరు భక్తియుక్తంబగు చిత్తంబులో ధ్యానింతురో వారు పరాత్పరుని యవ్యాజకరుణకుఁ బాత్రులగుట నిస్సందేహము. కాని యీభక్తివలన మానవునకు సుఖదుఃఖములు సమానము అను నార్యోక్తి ప్రకారము సౌఖ్యముకలిగిన వెనుకనే కష్టము కలుగుచున్నది.

"శ్లో. సర్వాణి కర్మాణి మయిసన్యస్య మత్పరాః।
అనన్యే నైవయోగేన మాంధ్యాయంత ఉపాసతే తేషా
మహం సముద్ధర్తా మృత్యు సంసార సాగరాత్ భవామి
నచిరాద్భక్తా మయ్యావేశిత చేతసాం."

అనునట్లు చిత్తమును భగవంతునిపైఁ గేంద్రీకరించి, సర్వముఁ
ను త్యాగమొనర్చిన వా రచిరకాలంబున మోక్షము నొందుచున్నా
రు. భక్తియోగమువారికిమృత్యువుఁగల్గించి వైకుంఠమునకుఁగొనిపోవు
చున్నది. సర్వమును భగవదర్పితమొనర్చి భక్తిపరులైయున్నవారతే
శీఘ్రకాలములో మృతినొంది విష్ణుసాయుజ్యలాభము నొందుచున్నారు
ఒకవేళ చిత్తము పరమాత్మునియెడ లగ్నమొనర్చుట కశక్తులైనచో
భగవంతుని సదాధ్యానింపనగును. అందులకును సమర్థతలేనివారు
"సమస్తము భగవదధీన"మని తలంచుచున్నచో ముక్తికలుగుటకు
సందేహము లేదు.

శ్లో॥ శ్రేయోహిజ్ఞాన మభ్యాసాత్ జ్ఞానాద్ధ్యానం విశేష్యతే,
ధ్యానాత్ కర్మఫలత్యాగః త్యాగాచ్ఛాంతిరనంతరం॥

అనునట్లు అభ్యాసముకంటె జ్ఞానమును, జ్ఞానములో భక్తితో
గూడినజ్ఞానమును, ధ్యానమున కర్మఫల పరిత్యాగమును మేలు. కర్మ
ఫలమును త్యజించుటవలననే మోక్షము కలుగుచున్నది. కావున భూత
దయగలిగి, మమకారాహంకారముల విడనాడి, సుఖదుఃఖముల యెడ
సమభావముఁ గలిగి, నిత్యానందముతో భగవంతుని యెడల మనస్సు
లగ్నముచేసినవానికి మోక్షము కరతలామలకము.

ఆసనాభ్యాసవిధులచేత, జపకుండలిని భేదించి, సుషుమ్నా నాడి
యందుఁజేర్చి యుంచవలెను. గుదమందపానవాయువును, నాభియందు

సమానవాయువును, హృదయమున ప్రాణవాయువును, కంఠమున దాన వాయువును, శరీరమున వ్యానవాయువును వ్యాపించియుండి, ప్రాణ వాయువు హృదయకమలమున కొట్టుకొనుచుండు నిదియే నిరాకార భావ" మని చెప్పి యంతర్ధానము నొందెను.

చంద్రశేఖరుఁడు తన సౌరాష్ట్రదేశమున కరుదెంచుచు మార్గ మధ్యమున విజ్జలదేశమున విడిసెను. ఆరాజునకు సంతానము లేనందు న పట్టపుయేనుగతొండమునకొకపూలహారము దగిలించి యీహారము నీకుంజర మెవరికంఠమున గీలించునో వారికి రాజ్యమును దనకుమా ర్తెయగు చంద్రరేఖనుయిచ్చి పెండ్లిచేయుదునని ప్రకటించెనని తెలిసి కొనెను.

ఆరాజేంద్రుడు విడిచిపుచ్చిన కుదేభము తిన్నగావచ్చి మార్గ మున నొకచోటనున్న చంద్రశేఖరుని కంఠమున హారము గీలింప చంద్రశేఖరుడును నాతనియర్ధాంగియు నంతఃపురమున కరిగిరి. మహా వైభవముగ చంద్రరేఖాచంద్రశేఖరులకు వివాహముజేయబడెను. పదునైదుదినము లానగరంబుననుండి యనంతరము చంద్రశేఖరుడు యిరువురుభార్యలను వెంటబెట్టుకొని సౌరాష్ట్రదేశమున కరిగెను.

ఆతనితండ్రి విజయకేతువుమహారాజును నిరువురు సహోదరు లును తమ్ముని సతీమణులగని యానందభరితాంతఃకరణులైరి."

ఈకథనాలకించి యర్జునుడు హర్షోత్ఫుల్లవదనుండై నిద్రించెను.

ఎనిమిదవకథ సమాప్తము.



## తొమ్మిదవ కథ.

---

శ్రీకృష్ణుండు కిరీటింజూచి "బావా! నీకు నేడు యజ్ఞదత్తమహారాజుచరిత్రముం దెలిపెద నాకర్ణింపుము. వేదాంతమర్మములలో నుత్తమమైనదగు మోక్షము లభ్యమగువిధానమును నీరాజుచరిత్ర ముద్బోధించు"నని యిట్లుచెప్పదొడంగెను.

# యజ్ఞదత్తమహారాజుకథ.



తొల్లి విదర్భదేశమును జయధ్వజమహారాజు పరిపాలించుచుండెను. అతడు చిరకాలము కాళికాదేవింగూర్చి తపస్సుచేయ నొక బాలుడు జన్మించెను. అతడు షోడశకళాపూర్ణుడై యెల్లరకు నయనపర్వముగనుండెను. రాజు తన కుమారునకు జాతకర్మలు నిర్వర్తించెను. అతనికి యజ్ఞదత్తుడని నామకరణముజేయబడెను. ఇట్లుండగా నొకనాడు మహారాజుకడకు లక్ష్మణపండితుడను గొప్పజ్యోతిషశాస్త్రపారంగతుడు వెళ్ళెను. జయధ్వజమహారాజు తన కుమారునిజాతకము వ్రాయుమని యాపండితునితో జెప్పెను. ఆపండితుడు యజ్ఞదత్తునిజాతకమువ్రాసి "మహారాజా! ఈతడు నీకుమారకుడై జన్మించినాడు. ఈతని గ్రహస్థితి ప్రస్తుతము ఎంతమాత్రమును బాగుగాలేదు. ఈత

దేశములప్రియముగలవాఁడగుటచే నీరాజ్యమన్యాక్రాంతమగు ను. నీవు మరణింతువు. ఈతఁడు చాలకాలము కష్టములమధ్యకాలము గడుపవలసియుండును. కష్టములుగడచినపిదప నీతఁడు చతురంభోధిపరీతమైన భూతలము నేకచ్ఛత్రముగ శాసించును. ఇదిసత్యము." అని చెప్పెను.

రాజు పండితుని సత్కరించి, సెలవిచ్చి, దుఃఖసాగరమున మునింగెను. అతనికేమి చేయుటకును దోచలేదు. లేకలేక కలిగిన కుమారుని విడిచి పెట్టుటకును నాతనికి మనసొప్పలేదు. ఆతని జననము తన ప్రాణములకే ముప్పు తెచ్చిపెట్టునని యొకవంక విచారము వేధించుచుండెను. ఆతఁడు తన ప్రాణములఁ బోగొట్టుకొనుట కంటె కుమారునే యరణ్యములకుఁ బంపివేసినచో క్షేమముగ నుండునని తలంచి, బాలుని మనసొప్పక తటస్థముగ నుండెను. ఇంతలో నాబాలునకు పదునయేఁడు ప్రాప్తించెను. చేరరాజ్యాధిపుఁడు దండెత్తి విదర్భదేశపుకోటను ముట్టడించి, వశపరచుకొనెను. జయధ్వజుఁడు, తన కింక కోటను వశముచేసికొను టశక్యమని తోఁచగా, రహస్యమార్గమున కుమారుఁడగు యజ్ఞదత్తునితోను భార్యతోను వనములకు బయలుదేఱెను. ఆతఁడు వనమున దిరిగి తిరిగి, శ్రమము దుస్సహముకాఁగా నొకచోఁ గూలఁబడెను. గర్భవతియైన యాతని భార్య యొక పుత్రుని ప్రసవించెను. అపుత్రుఁడును నామెయుఁ గూడ మృతినొందిరి.

జయధ్వజుఁడు విచారపారావార నిర్మగ్నుండై కుమారునొక నగరమునకుం దోడ్కొనిపోయి, యచ్చోట యాచనమూలమున కాలముం గడపుచుండెను. కొన్నాళ్ళకాతఁడు వ్యాధిపీడితుఁడై మరి

ణించెను. యజ్ఞదత్తుఁడు కొంచెము బుద్ధికలవాఁడై, యానగరమున నొక బ్రాహ్మణునియింటఁ బశులకాపరియై పనిసేయుచుండెను. ఒకనాఁడు పశువులఁ దోలుకొని, యరణ్యమున కరిగినంతనే గొప్ప తుపానువచ్చెను. ఆతుపానులో మార్గము తెలియక యజ్ఞదత్తుఁడు తబ్బిబ్బుపడెను. పశువులన్నియు నిటు నటు చెదరిపోయెను. ఇంతలో నొక శార్దూలము యొక్క గాండ్రు గాండ్రుమను శబ్దము వినబడెను. ఆశబ్దము నాకర్ణించి, యజ్ఞదత్తుఁడు వృక్షము నారోహించెను. ఆమహీజముయొక్క కొమ్మపై నొక సర్పముండెను. ఆపామీతనిని కాటువేయ, నతఁడు విషము తలకెక్కి క్రిందపడిపోయెను క్రింద కత్తులకొలను వేఁటకాఁడొక వలఁబన్నియుండెను అవలఁపై నితఁడు పడి, స్మృతిహీనుఁడై యుండెను.

ఉదయమున వేటకాఁ డరుదెంచి యాబాలుని దీసికొని యొక నగరమునకు గొంపోయెను. ఆనగరమునయున్న యొక ఘనవైద్యుఁడు తనయొద్దనున్న మూలికను వాసనచూపించెను. ఆమూలిక నాఘ్రాణించి యజ్ఞదత్తుఁడు పునర్జీవితుడయ్యెను. ఆవైద్యుఁ డాబాలుని మఱియొక పిల్లలులేని బ్రాహ్మణునకు బెంచుకొనుట కిచ్చెను. అతఁడొక పాఠశాలలో జదువుకొనుచుండెను. ఆపాఠశాలలో రాజుగారి కుమారుడు మంత్రికుమారుడు చదువుకొనుచుండిరి. ఒకనాఁడొక జ్యోతిష్కుఁ డరుదెంచెను. అతఁడు ఆపాఠశాలలోని బాలురందరిహస్తములను బరిశీలించి యాతని ఫలములం జెప్పి యజ్ఞదత్తునిహస్తముకూడ పరిశీలించెను. "ఈబాలుఁడు రాజగు"నని యాతను వారితోఁ జెప్పెను.

ఈవిషయము రాజునకు దెలిసెను. ఆరాజు యజ్ఞదత్తుని రాజలక్షణలక్షితుండై యుండుటగమనించి యాతఁడుండుటవలన దనకు ఆపా

య మొదవునేమోనని శంకించి యాబాలుని కానసమధ్యమునకుదీసి కొనిపోయి చ పిరండని యాజ్ఞాపించెను. ఆభటులు యజ్ఞదత్తుని యర ణ్యామధ్యమునకు దీనికొనిపోయి చంపుటకు జేతులురాక "అయ్యా! నిన్ను వధించుటకు జేతులు రాకున్నవి. చంపుమని రాజాజ్ఞయైయున్న ది అ:గా యజ్ఞదత్తుడు "ఓభటులారా! అంతయు దైవాధీన"మని యూరకుండెను. భటులు కనికరమూని యాతనిని "నీదారిననీవుపొ" మ్మని రాజునొద్దకుబోయి "మహారాజా! ఆబాలుని ముక్కలుముక్క లుగ నఱకివైచితి'మని చెప్పిరి.

యజ్ఞదత్తుండు యెటుపోవుటకును దోచక యాభయంకరాటవి నాయర్థరాత్రింబున కంటక సమన్వితములైన పథముల ననుసరించి నడచి యాముళ్ళబాధకుఁదాళఁజాలక యొకచో బడిపోయెను. వేకు వనే యచటి కనతిదూరముననే యాశ్రిమమున్న పరాశరమహాముని యాచైతన్యహీనుఁడైన రాకుమారుని గాంచి తన యాశ్రిమమునకుం గొనిపోయి శైత్యోపచారంబులొనర్చిన నాయజ్ఞదత్తుండు లేచి యా ఋషికి నమస్కరించి తాననుభవించుచున్న కష్టములంగూర్చి తెలిపి "మహాత్మా! ఈజీవితమునెడ నాకిసుమంతయు ననురక్తి లేదు. నాకు మోక్షమార్గముపదేశించి నన్ను ధన్యుంజేయు''మనివలికిన నాఋ షీశ్వరుఁడు దయార్ద్రిహృదయుండై యిట్లుచెప్పఁగడంగెను.

"రాజకుమారా! మోక్షసాధమునకుఁ బ్రిథమసోపానము సత్సాంగత్యము. వినలేదా?

శ్లో॥ సత్సంగత్వే నిస్సంగత్వం, నిస్సంగత్వే నిర్మోహత్వం
నిర్మోహత్వే నిశ్చలతత్త్వం, నిశ్చలతత్త్వే జీవన్ముక్తిః॥

యను నట్లు దుస్సాంగత్యము విసర్జించి సత్సహవాసము వలయును. సత్సాంగత్యకారణము సర్వసంగ పరిత్యాగబుద్ధి జనించును. సత్సాంగత్యము గల పురుషుఁడు భ్రాంతిరహితుఁడై నిశ్చలచిత్తముతో పరమాత్ముని భజించు కుతూహలం బొదవును. అదియే జీవన్ముక్తి హేతుభూతంబగును. సజ్జనులతోడి మైత్రివలన చంద్రదర్శనమున తాప మంతరించినట్లు, పాపములు పటాపంచలగును. సత్సాంగత్య మొనరించువాఁ డింద్రియనిగ్రహము, శాంతహృదయము, సత్యవాక్స్థి రతి కలిగియుండవలెను.

మఱియు నాత్మతత్త్వము తెలియుటకై పురుషునకు జ్ఞానమవ సరము లింగదేహములేక స్థూలదేహ మెంతకాలముండునో యంత వఱకును జీవునకు విచారమపారమై యుండును గాన జ్ఞానజ్యోచే కర్మ బంధము సడలించుకొని, స్థూలదేహ విసర్జన మొనరించునవలెను.

సత్యమే జ్ఞానమై, జ్ఞానమే పరబ్రహ్మస్వరూప నిర్ణయ సాధనమై వెలయుచున్నది. ఈనిర్ణయము తెలిసికొన్నవారు గంగా యమునా గోదావర్యాది నదులందుఁ గ్రుంకులిడ నక్కఱనే లేదు. సహవాసము చేసినంతమాత్రమున నాపురుషులు దుర్గుణములు గాని, సద్గుణములు గాని యతిసులభముగా నలవడును. దొంగసహవాసము చేసినవానికి చౌర్యము చేయవలయునను బుద్ధియే జనించును. భగవద్భక్తుఁడగు వాని సాంగత్యమొనరించువానికిఁ గూడ భక్తి యలవడితీరును. శరీర మశాశ్వత మని గ్రహించవలెను. బుద్బుద ప్రాయమని గ్రహించి, "ప్రాణవితతికంబుఁ బసిడితీసి" ।యను వాక్యోక్తి ననుసరించి, ధనముమీఁద ప్రీతిమానవునకును నాశ స్వభావికము కాఁబట్టి యాదురాశను బోనాడుటయు, కాంతమీఁది మమకా

తము అనగా కామాతురత నణంచుకొనుటయు ధనేషణ, దారేషణ, పుత్రేషణ యను ధనాపేక్ష, దారాపేక్ష, పుత్రాపేక్షలను సంపూర్ణముగా మఱచి తీరవలయును ఈలోకము ధనము, భార్య, మున్నగునైహికసుఖములన్నియు నసత్యమే. ఒక్క పరబ్రహ్మమే నిజము ఆ నిజము సత్కార్యమున గాని యన్య సాధనంబుల వలన లభ్యము కానేరదు. సకలము, సమస్తము దైవాధీనంబని పలికిన పరాశర మహాముసికి యజ్ఞదత్తుఁడు నమస్కృతులొనర్చి, "మహాత్మా! తమ శుశ్రూషచేయుచు నిందేయుందు"నని పలికి, మూఁడువత్సరములైన పిదప, లోకసంచార కౌతూహలము జనింప, నాఋషీశ్వరుని సెలవుగైకొని, పోయిపోయి యొక నగరముంజేరెను.

ఆనగరములోని ప్రతియింటి తలుపును బంధింపబడి యుండెను. ఎవరి నన్నమడిగినను తలుపులు తీయఁబడక యుండెను. రాత్రియయ్యెను. గృహద్వారము లన్నియుఁ దెఱువఁబడెను. ఎల్లరు తమతమ కార్యములఁ జేసికొనుచుండిరి.

యజ్ఞదత్తుఁ డొక బ్రాహ్మణ గృహము సమీపించి, "అయ్యా! కొంచెమన్నముఁ బెట్టువరా?" యని యడుగ, వాఁడా యజ్ఞదత్తునకు భోజనంబిడి "అయ్యా! ఈయూరిచరిత్రము కరము విచిత్రమైనది. ఈదేశపు మహారాజు నిరతాన్నదానముసేయుచున్నాఁడు. ఆతని కొక మునీంద్రుని కరుణవలన నిరువురు పుత్రికలు జన్మించిరి. ఆపుత్రికలకు హరిహరప్రసాదశాస్త్రి యను పండితుఁడు విద్యాభ్యాసము చేయించుచున్నాఁడు. ఆతనికి యొక్క సుగుణముమాత్రము తక్క యితరగుణములన్నియు దుర్గుణములే యైయున్నవి. ఈతఁడు సర్వమును దన యధీనమనియే తలంచుచుండువాఁడు" అనగా యజ్ఞ

దత్తుఁడు మరునాటి పగటివేళ నిద్రించి, మరునాటి రాత్రి యజ్ఞదత్తుఁడు రాజుగారి యింటికేగెను. అచ్చట పెక్కు-మంది భోజనము సేయుచుండిరి. ఈతఁడుకూడ భోజనమున కాహ్వానింపఁబడెను. భోజనమునకుఁ గూర్చున్నంతనే రాజు "అంతయు నాయధీనము కాదా?" యని ఒక్కొక్కరినే యడుగుచుండెను. ఈతనికథ కరుడెంచి రాజటులే యడుగ, నితండు "మహారాజా! అంతయు మన యాధీనంబనుట తగదు. అంతయు దైవాధీనం"బనుండవగా నారాజేంద్రుఁడాగ్రహావేశ పరవశుఁడై "ఓరీ దురాత్మ! కలుషాధమ! నాయింటికి భోజనమున కరుదెంచి, నాకు వ్యతిరేకముగ నంతయు దైవాధీనంబని పలికిన నీనాలుక వేయిచీలికలు కావలయు" నని మంత్రిం బిలిచి, "వీనికేమి శిక్షవిధింత" మన సెల్లరు నైక్యకంఠముతో "మహాప్రభూ! వీనికి మరణశిక్ష విధించుటయే మే"లనిరి. భోజనము చేయుచున్న వారిలోఁ గొందఱుమాత్రము "ప్రభువతంసమా! ఈతని వదనము రాజలక్షణ శోభితంబై యున్నది. ఈతఁడన్న యొక్క వాక్యమునకే తామంతగా యాగ్రహముం జెంది శిరచ్ఛేదనశిక్ష విధించుట పాడికాదు. వీని నెందైనఁ బంపివేయు." డని యనగా, నారాజు వారిమాటలను గూర్చి కొండొకతడవాలోచించి "సరే భటులారా! వీనినొక నౌకలోనుంచి, సముద్రమున వదలివేయుం డందాహారము లేక శుష్కించి మరణించుటయే, వీనికిఁ దగిన గొప్పశిక్ష యని యెను.

భటులాతనిం గొనిపోయి యొకచిన్న నావయందుంచి మఱొక నావపై సముద్రమధ్యమువఱకు యజ్ఞదత్తునటవిడిచి తిరిగివెడలిపోయిరి. యజ్ఞదత్తుఁ డాచిన్ననావలో నంతయు దైవాధీనంబని పరుండియుండెను. ఆసాగరగభీరతరంగాఘాతమున నావ యటునిటుతూలుచు పోవుచుండెను. పదునైదుదినములవఱకు నాతఁ డాహారము లేక గాలి

మొటువీచిన నటుబోవుచు తుదకుఁ గళింగపట్టణముంజేరెను. ఒకజాలరి చేపలనుబట్టుటకువచ్చి యానావనుజూచి సమీపించి తీరమునఁ బరుండఁజేసెను. ఇంతలో నాకళింగపట్టణాధీశ్వరుండైన జయసేనమహారాజు సపరివారముగ స్నానమున కరుదెంచి యీజాలరింజూచి ఏమది యని ప్రశ్నింప నాతడు నౌకలో గొట్టుకొనివచ్చినవృత్తాంతము నెరింగించెను. రాజు వెంటనే తనయాస్థానవైద్యునిబిలిపించి చికిత్సచేయించి పాలుత్రావింపగా నీరసస్థితిలోనున్న యాతనికి దెలివికలిగెను. ఆజయసేనమహారా జీతనింజూచి "ఓయీ! నీవెవరవు?"వని ప్రశ్నింప నాతఁడు "దైవాధీనం"బనెను. "అయ్యా! నీదేయూరని ప్రశ్నింప నాతడుమరల దైవాధీనంబనెను.

ఈవిధముగా ఏప్రశ్నయడిగినను, నంతయు దైవాధీనంబను నారాజకుమారుం జూచి, జయసేనమహారాజు క్రోధోన్మత్తచిత్తుఁడై "నేను శ్రమపడి యీ జీవచ్ఛవమునలెనున్న వాని కుపచారముల నలుప నితండెందులకి "ట్లంతయు దైవాధీనం" బనుచున్నాఁడేమి పాప మీతని వధింపుఁ" డన నటనున్న వారు "రాజా! వీనిని మీరే బ్రతికించితిరి. ఇప్పుడు చంపఁ బూనుట ధర్మయుక్తముకాదు. కావున రక్షించుటయే కర్తవ్యము. ఈతఁడనేక కష్టముల ననుభవించియుండును. అందు వలన నీరీతిగా వైరాగ్యము పూనియుండు" నని తోచుచున్నది. స్త్రీల ప్రేమానురాగములకు వశుఁడుకాని వారెవరునుండరు. గాన ఏవిధముగనైన ప్రయత్నించి, యీతనిచే మాట్లాడించి, యీతని చరిత్ర మెఱుంగుట ముఖ్యమని తలంచి యారాజేంద్రుఁడు తన దేశమున నీతనిచే మాట్లాడించిన వారి కయిదువేల రూప్యములు బహుమానము. అయిదు మాసముల వ్యవధి చేయజాలనివారి కురిశిక్ష" యని ప్రకటింపించెను. ఉరిశిక్షకు భయపడి, ఎవరును సాహసింపరైరి.

ఈబహుమానము నాకళింగపట్టణములో సౌందర్యమునకును గడుసు దనమునకును దన కెవ్వరు నీడుజోడు రారని తలంచుచున్న హేమా వతియను వేశ్య ఆశించి రాజదర్బారున కరిగి, యజ్ఞదత్తును దన గృహంబునకు, దీసికొనిపోయెను.

అనుదినము నామె యాయజ్ఞదత్తునికి షడ్రసోపేతంబగు భోజ నంబిడుచు యాతనిని సంభోగసాగరతరంగముల నోలలాడించుచు మా ట్లాడింప వివిధములఁబ్రయత్నించెనుగాని లాభమొకలుగదయ్యె. ఆమె తా నెందులకు గొఱివితో దలగోకికొన్నట్లు రాజసభలో బంతముపట్టి తినాయని విచారింపగడంగెను. ఆమెయిక యాతని సేవిధమున బ్రయ త్నించియు మాట్లాడించుట విఫలమని గ్రహించి యర్థరాత్రింబున నాతనిని దనసౌధమునుండి త్రోసివేయఁదలంచెను. ఆతడుతనకు జెప్ప కుండ యర్థరాత్రింబున నెచటికోయరిగెనని రాజుతో జెప్పఁదలచి యామె యానాటియర్థరాత్రిమున యజ్ఞదత్తుని గ్రిందబడద్రోసెను.

ఆమార్గమున నపుడొక రాజులపెండ్లివారు తరలివెళ్ళుచుండిరి. ఈతఁడు తిన్నగా పాలకిలోబడి యందున్న పెండ్లికుమారు నవ్వలకు ద్రోసివైచి నాతడు పల్లకిననుసరించివచ్చుచున్న యేనుగులపాదముల క్రిందబడి నలిగిచనిపోయెను. వివాహమంటపమున యజ్ఞదత్తు డాఘూ ర్జరదేశరాజనందినియగు రాజనందినికఁఠమునకు మంగళసూత్రముగట్ట నపిదప వారంతయు దమరాజకుమారుఁడు కాడనిగ్రహించి విన్నదన ముజెంది విచారభరితాంతఃకరణులై తమదేశంబున కరిగిరి. చేయునది లేక యజ్ఞదత్తునే యల్లునిగా నాఘూర్జరదేశపురాజు గ్రహించెను గాని యిచ్చోటకూడ యజ్ఞదత్తుఁడు సరిగా మాటడక ఎవ్వరేమడిగినను "నంతయు దైవాధీన"మని సమాధానము జెప్పుచుండెను. రాజిందుల కు ఖేదమొంది యజ్ఞదత్తుని సంభాషింపఁజేయుటకు బ్రత్యేకముగ గొం దఱిని నియమించెను.

ఇట నిట్లుండ నట కళింగపట్నమునందలి జయసేన మహారాజా కుమార్తె లిరువురకును, మంత్రి కుమార్తెకును వివాహముచేయు వయస్సు ప్రాప్తించుటచే వారిరువురకును జదువునింక మాన్పింప నెంచి, రాజు గురుదక్షిణగా బంగారుపళ్ళెరమున రెండువేల రూపాయలనుంచి యిచ్చిరమ్మనిపంపిన, వారటులే గురువుగారి గృహంబునకు బయలుదేఱిరి. మంత్రికుమార్తెకూడ వారి ననుసరించెను.

గురువు హరిహరప్రసాదశాస్త్రి గురుదక్షిణ స్వీకరింపక "రాజకుమార్తెలారా! నాకు గురుదక్షిణవలదు. మీజనకుని యనుగ్రహకారణమున ధనవిషయమున నాకెట్టిలోపమును లేదు. మీముప్వురితోడను రమించి యానందము పొందుటయే నాయుద్దేశ"మన, నారాజపుత్రికలు "గురువర్యా! తాము పెద్దలు. వివేకవంతులు నయ్యు నిట్లుపలుకఁ జెల్లదు. తండ్రియు, గురుడును సమానమని శాస్త్రంబులు ఘోషించుచుండ, తామిట్లు వచించుట న్యాయమా? అదియునుంగాక మాకు కొలఁది దినములలోనే వివాహము కాఁబోవుచున్న"దని సూచించిన నాపండితుండాగ్రహోదగ్రుండై "కన్నియలారా! నాకోర్కె తెలిపితిని. సంతసమున నంగీకరించితిరా మీకు సకల శుభములు నొనగూడును. లేదేని మీరు నాశాపమున కుటిలగుదు రనుట కింతయు సందియము లే"దని పలుక, నాకన్నియలు చేయునది లేక "గురువర్యా! ఈదక్షిణమును స్వీకరింపుఁడు. మాకు శాపములిడవలదు. మీవాంఛను దగిన యదను లభించినపుడు తీర్చెద"మని పలికి వెడలిపోయిరి.

ఇటులుండఁగా, నానగరమున కొక గారడీవాఁడు వచ్చెను. ఆతనిచే యింద్రజాలవిద్య ప్రదర్శింపఁజేయుటకు రాజుగా రాజ్ఞాపించిరి.

ఆప్రదర్శనమైన మఱునాఁడే రాజకుమార్తెల స్వయంవరమహోత్సవ మగునని చాటింపఁబడెను. ఎల్లదేశముల నేలు మహీపతులును నరుదెంచిరి. ఘూర్జరదేశమునుండి యజ్ఞదత్తుఁడుకూడ ననుచరసహితుఁడై కళింగపట్నమున కరిగెను. సేనానాయకులు, సామంతులు, బంధుమిత్రులు నెల్లరు నింద్రజాలవిద్యాప్రదర్శనము విలోకింప నేతెంచి, తమతమ యాసనములం దుపవిష్టులైరి. అదియే తమ గురువుగారి కోరిక దీర్చుటకుం దగిన యదనని గ్రహించి, రాజకుమార్తెలు, మంత్రికుమార్తెయు, పండితునెవరును గుర్తింపకుండ నేదో యొక మాఱువేషము ధరించిర" మ్మని, పరిచారికచేఁ గబురంపించెను.

ఆవార్తనాలకించి, హాహాప్రసాదశాస్త్రి యొక్క రాజకుమారునివలె నలంకృతుఁడై యరుదెంచుచుండుట గాంచిన మంత్రి "అయ్యా! మన నగరములోని పెద్దలలోఁ జాలమంది యింకను రాలేదు. ఇందులకు హేతువెఱుంగరాదు. కావున నీవా భటులతో నేగి, వారిం దోడ్కొని రమ్మనెను. చేయునది లేక యాపండితుం డందులకు సమ్మతించి వెడలెను.

ఇట నారాజకుమార్తెలు తమలోఁ దాము గంటకొక్కరితవంతున మూఁడుమందిరములలో నాతనిపొందు నభిలషింపనిశ్చయించుకొనిరి. యజ్ఞదత్తుఁడు రాజుగారిమేడ యందచందముల గమనింపనెంచి సౌధమును బరీక్షించుచు నుద్యానవనములో బ్రవేశించెను. వెన్నెలహాయిగ గాయుచుండెను. యజ్ఞదత్తు డుద్యానవనసౌధమున బ్రవేశించెను. మొదటమందిరములో నాతడు ప్రవేశించి మల్లెపూలతో నిండిన హంసతూలికాతల్పముపై శయనించియుండగా రాజకుమార్తె వచ్చి ఆసౌధమునందలిదీపములు వెల్గుచున్నచో నెవరికైన యనుమాన మొదవునని

దీపమునార్పివైచి ఆరాజకుమారునిపక్కకు బవ్వళించి సుఖసాగరతరంగములలో దేలియాడెను. ఆమెవెడలిపోవుచు "గురువర్యా! మీకోరిక నెఱవేరినదిగదా సంతోషమేనా?" యని ప్రశ్నింప నాతఁడు ఎప్పటియట్లు దైవాధీనమని ప్రత్యుత్తరమిచ్చెను. కంఠస్వరమునుబట్టియు నంతయు దైవాధీనంబను ప్రత్యుత్తరమునుబట్టియు తాను భోగించిన యాతఁడు గురుఁడుకాఁడని గ్రహించి దీపము వెలిగించి యారాజకుమారుని వదనమును దిలకించి సంతోషసంభ్రమభయాశ్చర్యంబులొకేమారు తన్ను ముప్పిరిగొన "అయ్యా! నీవెట్లీమందిరమునఁ బ్రవేశించితి" వని ప్రశ్నించి యాతఁడు మఱలనంతయు దైవాధీనంబన తన తెలివితక్కువకు మిక్కిలిగ నిందించుకొనుచు "అయ్యా! ఇఁకనైన మీరీమందిరమునువీడి చనవలసిన" దన యజ్ఞదత్తుండట్లేయని యామందిరమునువిడిచి మఱొకమందిరముంజొచ్చిన నారెండవ రాకుమార్తెవచ్చి తనయక్కవలెనే దీపమార్పి భోగక్రీడలం దేలినపిదప నీతండు గురువుగాక యన్యుండని గ్రహించి విషాదవేదనావిదళితమానసయై యాతని నవ్వలకుఁబొమ్మని ప్రార్థింప నాయజ్ఞదత్తుండు మఱొకమందిరముం బ్రవేశించెను. మంత్రికుమార్తెకుగూడ నిటులేజరిగెను. ఆనాడు మంత్రి నిర్బంధమువలన నన్ని పనులనుజేయుచున్న పండితునకు రాజకుమార్తెలమందిరములకు రావలనుపడదయ్యెను.

ఉదయమున నామువ్వురును రాత్రివేళఁ దమకు జరిగిన పరాభవములం గూర్చి యుగ్గడించుకొని తమతోఁ బ్రథమసంగమమొనర్చిన యాతనినే దమ భర్తగా స్వీకరించినచోఁ బాతివ్రత్యభంగదోషము కలుగదని తలంచిరి.

స్వయంవర మండపమున రాజులెల్లరుం జక్కగా ముస్తాబై కూర్చుండియుండిరి. అత్యంత మనోహరముగ నలంకరించుకొని, సౌం

దర్య ధీధితుల నల్వంకలఁ బర్వఁజేయుచు రాజహంసలవలెను యువ్వ రును నరుదెంచిరి. ఆస్వయంవర చిత్రమేమన యువ్వరు నొకరినే వరింతుమని తలిదండ్రులతోఁ జెప్పియుండిరి ఆయువ్వరును రాత్రి తమతో సంభోగార్ణవ తరంగడోలికల నూగులాడిన యజ్ఞదత్తు నారాజసమూహమున గుర్తించి పుష్పదమము నాతని కంఠమునం దుంచిరి. వివాహము దెబ్బదియోగంబుల జరిగెను. గాని యిచ్చోట కూడ నాతఁడు "అంతయు దైవాధీనం" బను మాట మానమందున రాజు కోపించి, "ఇరువదినాల్గు గంటలకాలములో" నాతఁడు మా ట్లాడనిచో మిమ్ము వధింతునని కుమార్తెల నుద్దేశించి పలుక వారు పతినుద్దేశించి "తాము మాట్లాడనిచో మేము నదియందురు కుదు" మన, నాతఁడు ప్రమాదము వాటిల్లునని యెంచి, "సతీ మణులారా! నావ్రతము వీడితి"నని పలికి వారికానందము కలి గించెను.

ఘూర్జరదేశమునకును కళింగపట్నమునకును గూడ యజ్ఞదత్తు డు రాజై ప్రజానురంజకముగ రాజ్యము పాలించుచు నలువురు సతులతోను సుఖించె" నని కృష్ణుండు పలికెను.

ఇరువురును నిద్రావివశులైరి.

తొమ్మిదవ కథ సమాప్తము.



## పదియవ కథ.

---

శ్రీకృష్ణుండు పార్థునిం గాంచి, "బావా! నేఁడు నీకు సుగుణవర్మమహారాజు కథం దెలిపెద నాకర్ణింపు" మని, యిట్లు చెప్పఁగడంగెను.

# సుగుణవర్మమహారాజు కథ.

తొల్లి మాహిష్మతీదేశమును విజయసింహమహారాజు పరిపాలించుచుండెను. అతఁడు చిరకాలము సంతానహీనుఁడై యుండెను. విజయసింహమహారాజు కాళికాదేవిని గుఱించి, భయంకరము నుగ్రమునగు తపస్సు చేసెను. ఆమె యాతని తపశ్శక్తికి సంతసించి, యొక కుమారుఁడు జన్మించునట్లు వరమిచ్చెను. విజయసింహుని సతి విజయసేన గర్భవతియై, నవమాసములు గడచిన పిమ్మట కోటిసూర్యప్రభాభాసమానుండగు నొక పుత్త్రునిం గనియె. ఆకుమారునకా దంపతులు సుగుణవర్మయని నామకరణమొనర్చి, యనేకుల కన్నవస్త్రదానము లొసంగిరి.

శుక్లపక్షసుధాకరునివలె నాబాలుఁడు దినదినాభివృద్ధి నొందుచు, సకలవిద్యలు నేర్చికొనుచు నెల్లరికి ముద్దులమూటవలెఁ గనుల పండువొనర్చుచుండెను. ఆబాలుఁడు ఏడువత్సరముల ప్రాయము గలవాఁడయి నప్పుడు విజయసింహుఁడు తన మిత్త్రుఁడగు వైశాలీ

దేశాధీశుండగు ప్రియామిత్ర మహారాజు నొకర్తు నాహ్వానించెను. ప్రియామిత్ర మహారాజు సపరివారముగ నేగుదెంచి, విజయసింహ మహారాజు వలన గౌరవింపఁబడెను. ప్రియామిత్రమహారాజు సద్గుణ నిధియైన సుగుణవర్మ నాలోకించి యానందకందళిత హృదయారవిం దుండై తన కుమార్తె యిందులేఖ నిచ్చి పరిణయము గావింపనెంచి, యప్పటికేమియుఁ బలుకక కొన్ని దినములు గడచిన పిమ్మట తనదేశ మునకుఁ బోయి. యటనుండి విజయసింహమహారాజునకు యిట్లు లేఖ వ్రాసెను.

వైశాలి.
విభవ సం॥ జ్యేష్ఠ శు ౯.

శ్రీ శ్రీ శ్రీ మాహిష్మతీ దేశాధిపాధులు,

సదయహృదయులు, మిత్రశ్రేష్ఠులు నగు శ్రీ విజయసింహ మహారాజుగారికి వైశాలీ దేశాధీశ్వరుఁడు ప్రియమిత్రుం డనేక నమస్కృతు లొనర్చి వ్రాయునది—

"రాజేంద్రా! నీతో మొన్న మీనగరమునకు వచ్చినపుడే ముచ్చటింపఁ దలఁచియు, నంతగా సమంజసము కాదను నభిప్రాయముతోఁ దటస్థముగ నూరకొంటిని. నీకుమారుండగు సుగుణవర్మకు నాముద్దులపట్టి యగు యిందులేఖ నొసంగి వివాహము చేయఁదలంచి యుంటి నిందులకు నీవభ్యంతరముఁజెప్పక సమ్మతింతు"వని యాశించు చున్నాను. మన స్నేహము యీ బాంధవ్యపాశమున మఱింత దృఢము కాగలదు జవాబు వ్రాయఁ గోరెదను."

భవన్మిత్రుఁడు,
ప్రి యా మి త్రుఁ డు.

విజయసింహుఁ డాలేఖను చదువుకొని పరమానందభరితాత్ముఁడై తనకుమారుఁడును నాతనిపుత్త్రికయు వివాహోచితవయస్కులైనపుడు తప్పకవివాహము చేయుదురని లేఖవ్రాసెను. కొలదిమాసములు గడచినపిదప విజయసింహమహారాజు వ్యాధిపీడితుఁడై మరణించెను. ఆరాజు తన యవసానదశలో మంత్రియగు విశారదుంబిలిచి "అమాత్యవరేణ్యా! నాకుమారుని నీకుమారునివలెనే ప్రేమతోఁ బెంచి యుక్తప్రాయుఁడైనపిదప రాజ్యమునకు పట్టాభిషిక్తుం జేయు బాధ్యతనీది" యని చేతిలోఁ జేయి వేయించుకొని యసువులవీడెను.

మొదట విశారదుఁడు రాజకుమారునియెడ నభిమానముగ కొన్నాళ్లుమెలగెను. పిదప నాతని కారాజ్యమును దానే పరిపాలించి తన కుమారుఁడగు దుష్టకీర్తికి వైశాలీదేశాధీశుండగు ప్రజామిత్త్రుని తనయను వివాహము చేయుదలంచి రాజాంతఃపురమునందునొకదాదితో "నీకు ధనమిచ్చెద రాణికిని యువరాజునకును విషప్రయోగమొనరింపు"మని కొంతధనమిచ్చిన నామె యాధనముస్వీకరించి రాణియొద్దకరుదెంచి మంత్రి దురూహను దెలిపెను.

మంత్రి యిట్లాకస్మికముగ దుశ్శీలుఁడై కుతంత్రములబన్నుచుండుట కెంతయు దుఃఖించి రాణి దైవముపై భారమిడి వలయునంత ధనకనకవస్త్రాభరణములఁగొని వారణాసికింబోయివత్తునంతవఱకు జాగరూకుండవై రాజ్యపాలనము జేయుచుండుమని మంత్రితో వచించి తిన్నగా వైశాలీదేశమున కరిగెను.

ఆనగరమున నామెయొక సుందరభవనమున నివసింపసాగెను. వైశాలీనగరేశ్వరుండగు ప్రజామిత్త్రమహారాజుతనయ యగు నిందు లేఖకుం జదువుచెప్పు కృష్ణరాయశాస్త్రికడనే యీతడును విద్యా

ఖ్యానము జేయసాగెను. ఇందులేఖ సౌందర్యమును వీక్షించి సుగుణవర్మ ముగ్ధుండయ్యెను. ఇందులేఖ సుగుణవర్మ లిరువురును ఒకరిపైనొకరను రాగముగలిగి కలిసిమెలిసియుండిరి. వారిహృదయములందలి స్నేహ భావములు క్రమక్రమముగా ననురాగస్వరూపమును దాల్చుచుండెను. ఆరుసంవత్సరము లిట్లుగడచినవి. ఇందులేఖ నవయావనారంభావస్థలో నున్నది. ఒకనాఁ డామెకు పాఠము రాలేదు. ఆమె రాజకుమారుని జూచి "స్నేహితుఁడా! నాకు పాఠమురాలేదు. కొంచెముబోధించి గురువుగారివలన జీవాట్లులేకుండ జేయు"మనికోర నారాజనందనుఁడు "బాలికామణీ! నీకు పాఠముజెప్పిన నాకేమియిచ్చెదవు?"అనియడుగ ఇందులేఖ "నీవేమడిగిన యదియిచ్చెద"ననెను. సుగుణవర్మ యామె కు పాఠము చక్కఁగా బోధించెను.

మఱికొన్నిదినములు గడచెను. మాహిష్మతీదేశపుమంత్రి విశారదుఁడు విజయసింహామహారాజు చనిపోయెనసియు దాను రాజకుమారుండగు సుగుణవర్మను దీసికొనివచ్చుచున్నా'ననియుత్తరముర్వ్రాసెను. ప్రజామిత్రమహారాజు తనకుమార్తెతో నీవిషయముం జెప్పి గురుదక్షిణగా ధనమిమ్మని పంపెను.

ఇందు లేఖ యాధనముం దీసికొని, గురువుగారి గృహమునకుఁ బోయి, తానింక పాఠశాలకు వచ్చుటలే" దని పలికి, యారాజనందనునితోఁ జెప్పగా నాతఁ డశ్రుపూరితలోచనుఁడై "రాజపుత్రీ! ఇందు లేఖా! నేను నీకానాఁడు పాఠము చెప్పినపు డేది కోరిన నది యిచ్చెద నంటివి జ్ఞాపకమున్నదా" యని యడుగ, నామె "ఏమికావలయు" నని ప్రశ్నించెను. సుగుణవర్మ! "సుగుణముల దొంతీ! నేను నిన్నే మనసార ప్రేమించియుంటిని. నేనును రాజపుత్రుండనే నీవే నాకుఁ గావలయు" నని పలుక, ఆమె "అయ్యో! రాజకుమారా! నిన్నుకూడ

నేను ప్రేమింపకపోలేను. కాని మాతలిదండ్రు లన్యునకిచ్చి నన్ను రేపెల్లుండి పెండ్లి చేయ నిశ్చయించియున్నారు. ఇపుడు కర్తవ్యమే మని యడుగ నాతఁడు "ప్రేయసీ! మన మీదేశమును రహస్యముగ విడిచి, కొన్నాళ్ళు దేశసంచార మొనరించి, వివాహానంతరము తిరిగి వత్తము. అప్పటికి నేను నారాజ్యమును దిరిగి సంపాదించుకొందు"నని యెను. ఆమె యాతని మాటలకు సంతసించి, తా నారాత్రియే సర్వాభరణములను వెంటనిడుకొని, పరిచారిక సాహాయ్యముం గొని, నగరము యొక్క పడమటి ద్వారముకడ కరుదెంచెద నచట రెండు హయములతో వేచియుండు" మని పలుక, నాతఁ డట్లేయని, యింటికిఁ బోయి తల్లితో దేశసంచార మొనరించి, సైన్యముం గూర్చుకొని తన రాజ్యము నెట్లయిన దిరిగి సంపాదింతు" నని పలికి, యారేయి కరవాలమును, గొంత ధనమును, వస్త్రాభరణములను దీసికొని, పశ్చిమదిశ నున్న ద్వారముకడ వేచియుండెను.

ఇందులేఖ యింటికిఁ బోయి, యీ వృత్తాంతమును దన పరిచారికకుఁ దెలిపెను. ఆపరిచారిక" అమ్మా మన రాచకులమునకు నీ చేయఁ బోవు కార్యమెంత యపయశము నాపాదించును. నామాట విని, యీప్రయత్నమును మానుము" అనెను. ఇందులేఖ "చెలీ! నన్ను వివాహముఁ జేసికొనుటకై మాహిష్మతినుండి యరుదెంచు వాఁడు కురూపియో, గ్రుడ్డియో తెలియదు. నేను ప్రేమించిన రాజపుత్రుఁడు నవమోహనాకారుఁడు, నేనాతనిం దక్క యన్యులఁ బరిణయమాడఁ జాల" నని, వచించి తన నగల నన్నింటి నొక మూటగాఁ గట్టి, యాపరిచారికతో నర్ధరాత్రమునఁ బశ్చిమదిశ నున్న ద్వారముకడ కరిగి, సుగుణవర్మం గలిసికొని, అశ్వము నెక్కి, పరిచారికను వీడ్కొలిపెను. అయ్యిరువురును హయములపైఁ బ్రయాణము చేసి,

చాల దూరమరిగి, యొక రమ్యోద్యానవనముం జూచెను. ఆయుద్యాన
వనంబున నొక సుందరసౌధముండెను. ఆసుందరభవనమునకు ముందు
గనున్న సరోవరమునఁ గాళ్ళు కడిగికొని, వారామందిరము నిర్జనమై
యుండుట గమనించి, యందుఁ బ్రవేశించి, విశ్రమించిరి.

ఇంతలో నొకవృద్ధాంగన యరుదెంచి "అమ్మా! ఎన్నాళ్ళకు
గనబడితివి?" అని తనయాశ్చర్యము వెల్లడించెను. ఇందులేఖ యామాటలు
ల నాలకించి "అమ్మా! నీవెవరు? నన్నుచూచి భ్రమపడుచున్నటు
తోచుచున్నది" అనగా ఆముసలిది "అమ్మాయీ! నేను హేమా
వతి యను కన్యను పెంచినాను. ఆమె యెవనినో ప్రేమించి నాధనము
తీసికొని వెడలిపోయినది. మీరాయిరువురు వచ్చి నామందిరములో నివ
సించుఁడు. నాకు జాలధనమున్నది." అని వారిని దనసౌధములోనికిఁ
దీసికొనివెళ్ళెను.

వారామెసౌధమున నత్యంతానందపరవశులై కాలముగడపు
చుండిరి. ఒకనాటిరాత్రి వారిరువురు సరససల్లాపమగ్నులైయుండగా
నామె "నాథా! నిన్న మనముకూర్చుండిన మంటపమునొద్ద రత్నహా
రము మఱచివచ్చితి" నన నాతఁడు నేపోయి దానిందెచ్చెద" నని యాద
యమున యవ్వేళ ఇందులేఖను వప్పజెప్పి తానశ్వారూఢుడైపోయి
యాహారమునుగొనివచ్చుచుండగా నాహారములో రహస్యముగానున్న
యొకసన్నని పాము సుగుణవర్మకంఠముపై గాటువైచెను. ఆకాటుచే
నాతఁడు స్మృతితప్పి యాయశ్వముపై నట్లేపడియుండెను. ఆయశ్వము
తనయజమాని స్మృతితప్పియున్నాడని గ్రహించి నిజసౌధమును గుఱు
తింపఁజాలక మఱొక సౌధముచెంతకరిగి నిలువబడెను. ఆసౌధమున
లతాంగియను వేశ్య నివసించుచుండెను. ఆ వేశ్య యాసుగుణవర్మసౌం
దర్యము నాలోకించి విమోహితచిత్తయై యాతనిలోనికిఁ గొనిపోయి

సకలోపచారముల నొనరించెను. వైశ్యుం డరుదెంచి యొక మాలిక నాఘ్రాణింపఁజేయ నాతఁడు స్మృతినిఁ గాంచెను. ఆవేశ్యను విడిచి పోయినచో కృతఘ్నుఁడని నిందించు నేమో యని సుగుణవర్మ యిచ్చట నేయుండెను. లతాంగితల్లి శ్రీహరి తనకుమార్తె యారాజుతోడిసుఖమునే గోరుచు ధనార్జనమేమియు జేయకపోవుటయే గాక యిదివఱకు సంపాదించియుండిన ధనమునుకూడ ఖర్చుపెట్టుచుండుటకు గినిసి “అమ్మాయీ! నీకిది తగ దాతనినింక పొ”మ్మనుమనియెను. ఆమె “అతని నే బ్రేమించితిని, అతనికొఱకు నే నార్జించినధనము నేవ్యయపరచుచున్నాను నీవేమి చెప్పినను యీవిషయమున నీమాటవినుదానంగా”ననియెను.

ఆవేశ్యమాత యాతనిపై గోపించి యొక మాంత్రికస్త్రీయను రావించి మంత్రింపబడిన యాజలము నారాజపుత్రునిపై జిలికెను. వెంటనే అతఁడు చిలుకరూపముధరించెను. ఆరాజనందనుండగు సుగుణవర్మ చిలుకరూపమున నచటనుండక తిన్నగా ఎగురుచుబోయి రాజాంతఃపురమున రాజపుత్రివిహరించుచున్న స్థలమునఁ బ్రాలెను. ఎంతో ముచ్చటగాయున్న యాచిలుకనుజూచి ఆరాజపుత్రి మెల్లగ బ్రియత్నించి పట్టుకొని మేడనిమర ఱెక్కలలోనున్న మైనపుచే జేయబడిన పెట్టెయందుం గపోయెను. ఆయుత్తరక్షణమునందే సుగుణవర్మ చిలుకరూపమునువిడిచి నిజరూపమును ధరించెను. రాజపుత్రియగు జయకుమారి యామైనపుపెట్టెకనుఁగొని యాసుగుణవర్మసౌందర్యస్వరూపమునకు ముగ్ధయై పగటివేళల నాపెట్టెకసాహాయ్యమున నాతని చిలుకగా మార్చుచు రాత్రులం దాతనితో భోగజలధితరంగముల నోలలాడుచుండెను.

ఈరీతిగా మూఁడు మాసములు గడచెను. జయకుమారి గర్భవతియాయెను. ఈసంగతి రాజునకుఁ దెలిసిపోయెను. ఆతఁడు తన కుమార్తె రహస్య ప్రవర్తనముం దెలియఁజేసిన చెలికత్తెకు బహుమాన మిచ్చెద" ననెను. ఒక చెలికత్తె యామె శయ్యాగృహము ప్రక్క పొంచియుండి, జయకుమారి, చిలుకను పురుషునిగా మార్చి, యాతనితో భోగించుట కనులార జూచి, యవ్విషయము రాజునకుఁ దెలిపెను.

రాజు తన కుమార్తె యంతఃపురములోని చిలుకను దెప్పించి, ఎగిరిపోవునట్లు విడిచిపుచ్చెను. సుగుణవర్మ చిలుకరూపమున ఎగిరిపోయెను. జయకుమారి యాచిలుక లేనిదే తానాహారము స్వీకరించుట లేదనియు, నా చిలుక రాజపుత్రుఁడనియు, నాతని దప్ప తదన్యులఁ బెండ్లిచేసికొనుట లేదనియుఁ దెలుప నారాజు డెందంబున కొందలమంది, మంత్రివేత్తల కివ్విషయముం దెలిపెను. ఒకమంత్రి శాస్త్రపారంగతుఁడు పరకాయప్రవేశ విద్య నెఱింగిన వాడఁగుటచే డేగరూపము ధరించి, యా చిలుకను వెంబడించెను.

సుగుణవర్మ తిన్నగా ఎగురుచు బోయి గర్గమహాముని యాశ్రమముం జేరి, యాఋషితపః ప్రభావమున నిజరూపము ధరించి, యామైనపు వెండ్రుకను జాగ్రతపరచుకొని, యా ఋషి పాదములకుఁ బ్రణమిల్లి యిట్లనెను—

"స్వామీ! నే నిన్నికష్టముల ననుభవించుటకు యింతగా దుఃఖముం బొందుటకు హేతువు సెలవిచ్చి, నాయారాటముం బాపరే" యన, నాతఁడు "వత్సా! నీకు దుఃఖము యొక్క స్వభావమును, తదితర వేదాంత విషయములను బోధింతు" నని యిట్లు చెప్పసాగెను.

## గర్గముని యుపదేశము.

రాకుమారా! ప్రపంచములోనుండు ప్రతిజీవికిని దుఃఖము స్వాభావికమేయగునా? అయ్యది ఆగంతుకమాయను సందేహము జనించుచుండును. వేదశాస్త్రములకు చేదు ఏవిధముగా ప్రకృతిసిద్ధమో ఆత్మకు దుఃఖము స్వాభావికమైనచో నశింపజాలదు. గాన ఆగంతుకమేయని చెప్పనొప్పును. శరీర పరిగ్రహణంబున్న ప్రతిచోటను దుఃఖము కలదు. వివేకికి నవివేకినిగూడ విచారముకలదాయను సందియముపుట్టుటకు అవకాశమున్నది. వివేకిదుఃఖము అంతఃకరణావిషమనితలచివిరక్తభావముతో జూచును. అవివేకి తన కాదుఃఖము కష్టసంజనితమని తలంచి సుఖముకలిగినప్పుడవి సౌఖ్యదినములనియు నశుభములొదవినపు డయ్యవి అసౌఖ్యదినములనియు దలంచి పరితాపము జెందుచుండును. మఱియు నాత్మారామబ్రహ్మమనే మాయయని చెప్పుచుందురు ఈయాత్మారామబ్రహ్మము దేవమానవులును పశుపక్ష్యాదిజంతుజాలమును సృష్టించి తాను భగవంతుడనుపేరుతో ననేక చిత్రములను జేయుచుండును. పరిపూర్ణమునకు జైతన్యము లేకుండును. దీనినే యొటుకయందురు దీని స్వభావము వర్ణింప నాదిశేషునికైన నలవిగాదు. శరీరము నవరంధ్రమయము నాసారంధ్రములో నెఱ్ఱగానుండునది సూర్యనాడి తెల్లని వర్ణముగలది చంద్రనాడి. ఇడాపింగళానాడులుకల సుషుమ్నానాడి అగ్రిభాగము. వత్సా! నీకొఱకై కాశ్మీరనృపాలుని పుత్రిక కృశించిపోవుచున్నదని దివ్యదృష్టివలన నెఱింగితి నీవచ్చటికిబోయి యామెను బరిణయంబై సకలశుభంబులను పొందు" మని నంతనే ఆసుగుణవర్మ కాశ్మీరనగరరాజు నాస్థానంబున నిలిచెను. ఆతనింజూచి యారాజు నీవెవరవని ప్రశ్నించిన నాయువకుడు తన్ను రాకుమారి యగు జయకుమారి ప్రేమించిన"దనిచెప్పగా నారాజానందభరితాం

ంకరణుండై యాతనికిని తన కుమార్తెను బెండ్లిచేసెను. సుగుణవర్మయు తట నిందులేఖ సౌధమునకరుదెంచి, యామె దుఃఖమును బోనడచి, యామెతో లతాంగి యింటికిబోయి ఆమెనుగూడ తనతో దోడ్కొని వైశాలిదేశంబున కరిగెను.

ఇందులేఖ తనతల్లిని దర్శించబోగా నామె "ఓసి దురాత్మురాలా! కులమున కపయశము ఘటించితివని, నీతండ్రి యాగ్రహావేశ పరవశుండై మండిపడుచున్నాఁ" డని యామెవలన జరిగిన వృత్తాంతముం దెలిసికొని, తన భర్తతోఁ జెప్ప, నాతఁడా యుదంతమును కొలువులో నెల్లరికెఱింగించి, యల్లుండగు సుగుణవర్మను, నాతని తల్లిని రావించి యుచితరీతిఁ సత్కరించి, మహావైభవముగ వివాహమహోత్సవముంజేసి, దుర్బుద్ధితో రాజ్యము నపహరించిన విశారదుని శిక్షించి, యారాజ్యమునకు మరల సుగుణవర్మను బట్టాభిషిక్తుంజేయవలెనను నూహతో నాతనికి వివాహమున కాహ్వానించెను.

విశారదుడు సపరివారముగ నచటికరుదెంచి తనపుత్రునిజూపి యీతడే నాపుత్రుఁడగు సుగుణవర్మయని పలుకునంతలో సుగుణవర్మ క్రోధయుక్తుఁడై యాతనికి వెఱపుఁగల్గించెను. ఆమంత్రియు నాతని కుమారుని కారాగృహమున ద్రోయించిరి. సుగుణవర్మ మరల మాహిష్మతీదేశమునకు రాజయ్యెను.

ఈకథవిని అర్జునుఁడు నిద్రాపరవశుఁడయ్యెను.

పదియవకథ సమాప్తము.



కదకొండవకథ.

---

శ్రీకృష్ణార్జునులు చల్లని మంద మారుతము కొలఁకై విహరింపుచు, సరససల్లాపముల నాడుచుండఁగా శ్రీకృష్ణుండు "బావా! నేఁడు గూడ నాకొక పుణ్యచారిత్రముం జెప్పి కృతార్థుం జేయవే" యనిన, యదుకులభూషణుఁడంత నిట్లు చెప్పఁ దొడఁగెను.

# జయదేవమహారాజు కథ.

పూర్వ మొకానొకప్పుడు కోసలదేశమును జయచంద్రుఁడను మహారాజు పరిపాలించుచుండెను. అతఁడు సకల సద్గుణ సంశోభితుఁడు, భక్తిపరుఁడు, ప్రజానురాగము గలవాడునై యుండెను. అతనికి రాజ్యాంగ విశారదుఁడగు మంత్రి సుశర్మయను నాతఁడుండెను. అమాత్య వరేణ్యుడగు సుశర్మ కిరువురు పుత్రులుగలరు. వారిరువురు సౌందర్య వంతులు, బుద్ధిమంతులు, వీరులునై యలరారుచుండిరి. కొంతకాలము నకామంత్రి చనిపోయెను. ఆ యిరువురు కుమారులకును జయచంద్ర మహారాజు కబురంపి "మంత్రినందనులారా! మీతండ్రి మరణమునకు మీరెంతయుఁ గుందుచున్నారని గ్రహించితిని. మీరు దుఃఖింపఁ బనిలేదు. మీయిరువురును గూడ నాకు నేపటినుండి మంత్రులై గౌరవము పొందగలరు." అనియెను.

వారిలో మొదటివాని పేరు వసంతసింహుడు. రెండవవాని పేరు జయదేవుడు.

ఇరువురును దమతమ కార్యములఁ జక్కఁగా జేయుచు రాజున కాహ్లాదమొనగూర్చుచుండిరి. జయచంద్రుఁడు తాను వేటకుఁబోవు నపుడొకప్పుడు వసంతసింహుని మఱొకప్పుడు జయదేవుని తనతో దీసికొని వెళ్ళుచుండెడివాఁడు. ఒకనాఁ డాయన్నదమ్ములిరువురును రాత్రి వేళ భోజనానంతరము కూర్చుండి సరససల్లాపముల నాడుకొనుచుండిరి. అపుడు జయదేవు నుద్దేశించి వసంతసింహుఁ డిట్లనెను.

“తమ్ముఁడా! మనతండ్రిగతించినను రాజేంద్రుని యాదరమున సుఖించుచున్నాము. మన మిరువురమును నొకకుటుంబమునందు జన్మించిన యిరువురు బాలికల నొకేసమయమున బెండ్లి చేసికొనవలయును. నీ వందుల కంగీకరింతువా?”

“అన్నా! నీమాట కెదురాడువాఁడఁగా”నని జయదేవుఁడు పలికెను. జయదేవు “డన్నా! మన సతులిరువురు నొకేపర్యాయము గర్భిణులగుదురు. నీకుమగశిశువుజన్మించి నాకు యాడుపిల్లపుట్టినచో నాకుమార్తె కీవరణముగ మూఁడువేలగుఱ్ఱములనీయవలె”నని పలికినంతనే యావసంతసింహుఁడు కోపగించి “నీకెంత దురాశయున్న”దని యవ్వలకుఁబోయెను.

మఱునాటి యుదయమున వసంతసింహుఁడు రాజుగారితో వేటకుఁబోయెను. జయదేవుఁడు తనకును తన సోదరునకును నభిప్రాయభేదము కలిగినందున నిఁక నాయింట నుండనొల్లక ధనవస్త్రాభరణముల గొని యశ్వారూఢుఁడై చనెను. అతఁడు తిన్నగాపోయి యనేకారణ్యములనుగడచి భుశుండమహర్షి యాశ్రమమునకుపోయెను. ఆఋషీశ్వరున కాతఁడు ప్రణమిల్లి “మహాత్మా! నాకు మోక్షసన్యాసవిధానము నెఱింగించి నన్నుఁగృతార్థుఁ జేయరే”యని ప్రార్థించ నాతఁ డిట్లనియె.

"వత్సా! ఇష్టమైనన్న వస్తువును విడిచిపెట్టుటయే సన్న్యాసమనఁ బడును. యజ్ఞము, దానము, తపము, కర్మములను విడువక ఆచరించుచు వాని నీశ్వరార్పణము జేయుటయే మోక్షసన్న్యాసమని పేర్కొన బడుచున్నది. యజ్ఞదానతపంబుల మానక యాచరించువాడు భగవంతుని యనుగ్రహమునకు పాత్రుఁడగును. ఈమూఁటిని యాచరించుటవలన నతనిపాపములు పటాపంచలగుచున్నవి. వీనినాచరించునపుడు నిత్యనైమిత్తికకర్మలను విడిచిపెట్టరాదు. ఈ నిత్యనైమిత్తికకర్మల విసర్జించినవాడు తామసజ్ఞానియనియు శరీరకష్టమునకు వెఱచి కర్మత్యాగ మొనరించినవాడు రాజసజ్ఞానియనియు నిత్యకర్మానుష్ఠాన మొనరించువాడు సాత్త్వికజ్ఞానియనియు కష్టము నోర్పుతో సహించి ఈశ్వరార్పితముగ నాచరించువాడు కర్మత్యాగియనియు జెప్పబడును. కర్మఫలత్యాగికి మోక్షము సిద్ధించుటయే గాక జన్మరాహిత్యము కలుగును.

దేహాంకారేంద్రియ పంచప్రాణముల వ్యాపారమునునైయున్నది. మనుజుఁడాచరించు సత్కర్మమైనను, దుష్కర్మమైనను, పై దేహాంకరాదులు కారణమగును. కర్మయొక్క స్వరూపమును దెలిసికొనుటయే జ్ఞానమనఁబడును. తాను చేయఁబోవు కర్మ నెఱుంగుట జ్ఞేయమనబడును. దీని నెఱుఁగువాఁడు జ్ఞాతయనంబడును. ఈ మూఁటిని వేదవేదాంగకోవిదులు కర్మయొక్క విధిత్రయమని పేర్కొందురు. పరబ్రహ్మను భావజ్ఞానముచే విలోకించువాఁడు సాత్త్వికజ్ఞానియనియు, భేదభావముచే వీక్షించుచు భిన్నరూప విలసితునిగా నెంచి ధ్యానించువాఁడు రాజజ్ఞానియనియు, జెప్పఁబడును. సర్వము పరమేశ్వరున కర్పించి, పిపీలికలనుండి పరంధామునివఱకు నొక్కఁడేయని యెంచినవాఁడే మోక్షసన్న్యాసి యనఁబడును. అంతరింద్రియ, బాహ్యేంద్రియ, నిగ్రహములు, తపస్సు, పరిశుద్ధత, ఓర్పు, శాస్త్ర

పరిజ్ఞానము, అనుభవజ్ఞానము యివి యన్నియు భూసురకర్మలు. ధైర్యము, దానము, శౌర్యము, తేజము యివి క్షత్రియోచితము లగు కర్మలు వ్యవసాయవాణిజ్యములు వైశ్యునకును, పై మూడు కులములవారికి భక్తితో శుశ్రూషలొనరించుట శూద్రునకును విహితకర్మలు. రాగద్వేషముల వర్జించి, నిర్జనప్రదేశమున, నల్పాహారము మాత్రమే స్వీకరించుచు, ధ్యానయోగము బూని, కామక్రోధమదగర్వాహంకారములపేక్షి, శాంతియుతమగు హృదయములో బరబ్రహ్మ స్వరూపము నెఱుగుటకుఁ బ్రయత్నించుటయే మోక్షసన్యాసమనఁబడు"నని భుశుండ మహర్షికి జయదేవుఁడు నమస్కరించి, "స్వామీ! ధన్యుఁడనైతి" నని పలికి, యచ్చోటువాసి, తిన్నగా మగధదేశమునకుఁ బోయెను.

మగధదేశాధీశ్వరుఁడగు వీరకేతుమహారాజు కుంజరమునెక్కి పరివారసమేతముగ నరుగుచుండెను. ఆమహారాజును గాంచి యందఱును వంగివంగి నమస్కృతుల నొనర్చుచుండిరి. సుందరుఁడగు జయదేవుఁడొక ప్రక్కదూరముగా నిలుచబడి యావైభవమును కనులారఁగాంచి యానందించుచుండెను. మహారాజగు వీరకేతువును దూరముగనిలువబడియున్న జయదేవుని సౌందర్యమాకర్షించెను. మహారాజు జయదేవునిపిలిచి "ఓయీ! నీదేయూరని ప్రశ్నింప నతఁడు "మహాప్రభూ! నేను కోసలదేశమునుండి యరుదెంచినాను. నన్ను నా సోదరుఁ డవమాన మొనరించినందున ప్రపంచమునెడ విరక్తి జనించి యిటులేతెంచినాఁడ నీక నేనాదేశమునకెన్నఁడును బోవనేను.

అరాజేంద్రుఁడు "ఓ కుమారుకుఁడా! నిర్మలోను రాగమునకు నిశ్చలజీవితమునకు నీవిశ్వమున తావులేదు. వత్సా! గార్హస్థ్యమునకరుదెంచి సుఖజీవనమును గడపుము నేను.

జయదేవుడు వీరకేతుమహారాజు ననుసరించి యాతని మందిర మున కరిగెను.

జయదేవుఁడు వీరకేతు మహారాజున కతిథియయ్యెను. ఆమహా రాజునకు చిత్రాంగియను కుమార్తెయుండెను. ఆమె జయదేవు నా లోకించి, ప్రణయ విహ్వలయయ్యెను. ప్రథమసందర్శనమున నే వారి చిత్తములు భక్తిభావభరితము లయ్యెను. ఇరువురును బద్ధానురాగు లైరి. ఇది వీరకేతు మహారాజు గమనించి, యొకనాఁడాతనిం బిలిచి "వత్సా! నీప్రవర్తనము నాకత్యంతామోద మొదవించినది. నాకు మార్తెయగు చిత్రాంగి వివాహయోగ్యయైయున్నది ఆమెను దమ కుమారులకిచ్చి పరిణయ మొనర్పుమని యనేకులు వ్రాయు చున్నారు. నిన్ను చూచినపుడే నాకు నీయెడ నభిమానము కలిగి నది. నీకు నాతనయనిచ్చి, పెండ్లిచేయుదు" నని పలికెను. జయ దేవుని వదనము హర్షోత్ఫుల్లమైనది. శుభదినంబున చిత్రాంగి జయ దేవులకు వివాహమైనది జయదేవుఁడు మగధదేశమునకుఁ బట్టాభి షిక్తుఁడయ్యెను. రాజేంద్రుఁడు "వత్సా! నీవిపుడు నీకు కోసలమున విరక్తి కలిగిన హేతువును దెలుపవలయు"నన, నాతఁడు తనయన్న కును దనకును జరిగిన వివాదవృత్తాంతమును దెలిపెను. ఆరాజ పుంగవుఁడు నవ్వుచు "ఆహా! మీ వివాదము చాల విచిత్రముగ నున్న"దనియెను.

జయదేవుని కిచ్చట వివాహము జరిగిననాఁడే యాతని సోదరుఁ డగు వసంతసింహునకుఁగూడ వివాహముజరిగెను. కోసలేశ్వరుండగు జయచంద్ర మహారాజుతో వేటనుండి తిరిగివచ్చి తన పలుకులకు గ్రుద్ధుడై జయదేవుఁడిట వీడి చనెనని గ్రహించి, యపరిమితవిచార భరితాంతరంగుఁడై, తానే యాతని నన్వేషింప మగధదేశమున కరిగి యొక రాజసౌదనిని బరిణయమాడి, కోసలకుంబోయెను.

వసంతసింహ జయదేవులిరువురి భార్యలు నొకప్పుడే గర్భవతు లైరి. వసంతసింహునిభార్య రత్నాంగి యొకపుత్రికను, జయదేవుం డొక కుమారుని గనిరి. ఇరువురును శుక్లపక్షచంద్రులవలెదిన దినాభివృద్ధి నొందుచుండిరి. జయదేవుఁడు తన కుమారునకువీర సింహుఁడనియు, వసంతసింహుఁడు తన పుత్రికకు లలితకుమారియుం బేర్లుపెట్టిరి. జయదేవుఁడు తన కుమారునకు రాజ్యపాలన విధులన్నిం టిని దెలిపెను. ఆతఁడు వ్యాధిపీడితుఁడయ్యెను. ఆతఁడు తన యవ సానదశలో, కుమారుఁడగు వీరసింహుని బిలిచి, "కుమారా! నేనిఁక మరణింపనున్నాను. నాయీ తుదివాక్యముల నధికమగు శ్రద్ధతో నాలింపుము.

"జీవునకు జననమరణములు సహజములు. జీవిత మెట్టుల శాశ్వతమైనదో యటులే యీశరీరముంచునది నశాశ్వతము. నాయ న్న వసంతసింహుఁడు కోసలదేశమునకు మంత్రిగానున్నాఁడు. నీవెప్పు డైన నాతని యింటికిఁ బోయిరమ్ము. ఈవ్రాతప్రతికను జదువుకొను ము. నాచరిత్రమంతయు బోధపడగల" దని చెప్పి యసువులఁ బాసెను.

జయదేవుని మరణానంతరము మఱల వీరకేతువే మగధరాజ్య పరిపాలన భారము వహించియుండెను. ఆతఁడు తన మందిరమునుండి రెండుమాసములవరకును యీవలికి రాకపోవుటచే వీరకేతువు కోప ఘూర్ణిత నేత్రుఁడై "వీరసింహుని కరచరణముల బంధించి తీసికొని రం"డని భటులకాజ్ఞాపించెను.

ఈవిషయమొక భటుఁడువిని ముందు పరుగెత్తుకొనివచ్చి వీర సింహునితో జెప్పి "ప్రభూ! మిమ్ము బంధించుటకు భటులువచ్చుచు

న్నారు. త్వరపడి రమ్ము పైన వెడలిపోదాం"మనియెను. అవీరసింహుండట గొంతు ధనము దీసికొని వెడలిపోయి దేవాలయము జేరునప్పటికి దిక్కులెల్ల నంధకార బంధురములాయెను. వీరసింహుడు నిరాశుడై యాదేవాలయ సోపానముపై నిస్పృహుడై పడియుండెను ఇంతలో నాహారార్థ మరుదెంచిన యొకరక్కసుడు ఆదేవాలయమున కరుదెంచి, యచటనున్న వీరసింహుని సౌందర్యమును దదేక దృష్టితో నాలోకించి, "ఈతడు గంధర్వుడై యుండు"నని నింగికెగిరిపోయెను. ఆకసమున నారక్కసుని కొక దేవతకనిపించెను. ఆదేవత నుద్దేశించి యారాక్షసుడు "ఓఖేచరాంగనా! నీవొకపరి యీదేవాలయ సోపానముపై బడియున్న రాకుమారుని సౌందర్యమునుజూచి పోరాదా" యనగా, నామె యంగీకరించి, క్రిందకు దిగెను.

ఆదేవత యారక్కసుంజూచి "నేనొక యసాధారణ సౌందర్యవతిం గనుగొంటిని. చూపింతును ర" మ్మని కోసలదేశమున కరిగెను

కోసలదేశమున వసంతసింహునికుమార్తె విజయకుమారిని ఆ రక్కసుడును దేవతయుజూచిరి. దేవత "అసురకులోత్తమా! ఏమైననుసరియే ఈమెసౌందర్యము ఆరాకొమరుని యందమునుమించు ననెను. "కాదాతడే యందగా"డని యాతండువలుక నామె "మన మిరువురమును నీవిషయమై జగడమాడు టెందులకు? ఈయిరువురికిని బెండ్లిచేసి యానందింత"మనెను.

ఆయిరువురును నరేయని ఖేచరగమనమున మరల మగధకరుదెంచి దేవాలయసోపానముపైబడి నిద్రాముద్రితుడైన వీరసింహుని కోసలకు దోడ్కొనిపోయిరి. అంతకుముందే యచటనొక చిత్రము

జరిగెను. కోసలరాజేంద్రు డెట్లో వసంతసింహునకు అపూర్వసౌంద ర్యములో నొప్పారుచున్న పుత్రిక కలదని యెఱింగి యామెను తన కుమారునకు బెండ్లిసేయుమని కబురంపెను. వసంతసింహుడు తనపుత్రి కను దన మేనల్లున కీయఁదలంచితినని తెల్ప నాతఁడు రోషకషాయిత నేత్రుడై "నీకుమార్తెను బలాత్కారముగ నొకవృద్ధుడు కురూపియు నగువానికిచ్చి పెండ్లి చేయుదునని శపథ మొనరించి బ్రాహ్మణుల బిలిపించి యారాత్రికే వివాహప్రయత్నము లొనర్పఁబూనెను.

మహారాజు నాజ్ఞను వసంతసింహుడు ప్రతిఘటింపజాలకపో యెను. ఆరాత్రి పండ్రెండు గంటలకు ముహూర్త మేర్పఱుపబడెను. ఇట్టిసమయమున రాక్షసుడును దేవతయు వీరసింహుని దీసికొనివచ్చి కోసలదేశమున నొకప్రదేశమునదింపిరి. వీరసింహునకు మెలకువకలి గెను. అతడులేచి నాశ్చర్యముగ జుట్టుపక్కలజూచి దేవాలయము తనప్రక్కలేకుండుటయు నాతడేదో క్రొత్తనగరమునను౦డుటయు జూచి భయకంపితుఁడై ఏడవసాగెను. ఇంతలో నారక్కసుఁడును దేవ తయు నాతనికి బ్రత్యక్షమై "రాజకుమారా! ఎందులకుభయపడెదవు? ఆపోగుంపులో గలిసిపొమ్ము. నీవొకగృహమున కేగుదువు. ఆగృహ మున నొక సుందరాంగి యొకవికృతాకారునకిచ్చి పెండ్లిచేయబడు చుండును. ఈధనముందీసికొని యావివాహమును జూడవచ్చినవారి కెల్లరకు దీనింబంచిపెట్టుము." అని కొంతధనమిచ్చెను.

వీరసింహుడంత నాజనసమూహములోగలిసి వసంతసింహుని గృహమున కరిగెను. వసంతసింహుని కుమార్తె విజయకుమారి విషణ్ణ వదనయైయుండెను. వీరసింహుడచ్చోట ప్రతివానికిని ధనమును పంచి పెట్టుచు వారినందఱిని యాకర్షించెను. ప్రతివాడును విజయకుమారి ముసలివృద్ధునకు నిచ్చి పెండ్లి చేయుటకన్న యావీరసింహునకు

పెండ్లి చేయబడినచో నెంతయో బాగుండునని తలంచిరి. వివాహము జరిగెను. అందఱును అచటినుండి వెడలిపోయిరి. శయ్యాగృహమునకు వధువు పంపబడియెను. వరుడు వీరసింహుని సమీపించి "ఇంకను ఎందులకిచ్చటనున్నావు పొమ్మావలి"యనియెను. వీరసింహుడు బిక్కమొగము వైచికొని ద్వారముకడ కరుదెంచెను. రాక్షసుఁడట ప్రత్యక్షమై "పిఱికిపందవలె వెనుదిరిగివచ్చుచుంటివా? ఆవరుని నేనెదిరించెదను నీవా శయ్యాగారమున కూర్చుండి యామెను గాంధర్వవిధింబెండ్లియాడి సుఖసాగరతరంగముల నోలలాడు"మనియెను. వీరసింహుడు శయ్యాగారమున బ్రవేశించి హంసతూలికాతల్పము నధిష్ఠించెను.

వరుఁడు కిటికీతలుపులు బంధించుటకై చావడిలోనికి రాగా రక్షసుడు మ్యావు మ్యావు మని భయంకరముగా నఱచెను. మఱల దున్నపోతురూపము ధరించి వాడియైనకొమ్ములతో నాకురూపిని గ్రుమ్మి "ఓరీదుర్మతీ! నాప్రియసఖిని పెండ్లియాడెదవటరా?"యని యడుగ నావరుఁ "డయ్యబాబో! నీభార్యనాకు వలదోయి"యని కుయ్యిడుచు తలుపుఁదెఱచుకొని పాఱిపోయెను. విజయకుమారి విచారభరితాంతరంగయై శయ్యాగృహముఁ బ్రవేశించి యాకురూపికిబదులుగా నవలావణ్యతరుణ్యసంశోభితుండగు రాజసూనుండుండుటకు విస్మయపరీతచేతస్కయై "ఓమోహనమూర్తీ! నీవెవరవ?"వని ప్రశ్నింప నాతడు కాంతా! నేను నీమనోవల్లభుఁడను. ఇంతకుమున్నిట జరిగినదంతయు కపటనాటకము. మహారాజాడించిన కపటనాటకమని నీవును గ్రహించియేయుందువు."

ఆమె యాశ్చర్యానంద వివశయై 'నాకిదియంతయు మహాద్భుతముగ గన్పట్టుచున్నది.''అనియెను. ఇరువురును నాటిరాత్రి యానంద జలధితరంగముల నోలలాడుచుండిరి. తెల్లవారుచున్నదనగా రాక్షసుఁ

డును దేవతయుగలిసి వీరసింహుని దీసికొనిపోయి విదర్భదేశమున రాజవీధిలో నొకచో బరుండజేసి వెడలిపోయిరి. సూర్యోదయమైనను యాతఁడు బాటమీద నిద్రాముద్రితుడై యుండెను. ఆతనిచుట్టు నెందఱో సమూహముగా గూడియుండిరి. సూర్యకిరణములు ముఖముపై సోకుటచే వీరసింహునకు నిద్రాభంగమై తనచుట్టును నున్నజనుల నుద్దేశించి "అయ్యా! నేనిపుడు ఎచ్చటనున్నా"నని ప్రశ్నింపగా నాతడు "అయ్యా! తమదేదేశమోగాని తామిపుడు విదర్భదేశమునందున్నారని గ్రహింతురుగాక"యనెను.

నేను నిన్నటిదినము పగటివేళ మగధలోనుంటిని. రాత్రికోసలదేశమున నొకసుందరీమణితో గడపితిని. నేటియుదయమున నిచటనుంటి"ననెను. అందఱును "తామింకను స్వప్నావస్థలోనుంటిరేమో"యనిరి "నేను వివాహముఁజేసికొనిన కన్యయే"దని వీరసింహుఁడిటునటుకలయఁజూచెను. అందఱు నీతఁడు పిచ్చివాడని వెఱ్ఱివాడని గేలిసేయసాగిరి. వీరసింహుడు తిన్నగా నొక విజనప్రదేశమున కరిగి గడచిన చిత్రములకు విభ్రమజెందుచు కర్తవ్యము నాలోచించుచు మధ్యాహ్నమువఱకునుండెను. మధ్యాహ్నసమయమున నాతడు క్షుత్పిపాసాపీడితుఁడై యుండుటచే నొకపిండివంటలవాని గృహమున కరిగెను. ఆతఁడు వీరసింహు నాదరించి "నాయనా. నీకివి శుభదినములు కావు. కొన్నిదినములవఱకు నాకడనేయుండుము. నీకేమిలోపమును కలుగకుండజేయుదు"ననియెను. ఆవీరసింహుడట్లేయని యాదుకాణమువానికడనుండ నిశ్చయించుకొనెను.

అట విజయకుమారి వేకువనే లేచి, తననాథుఁడు లేకుండుటకు విచారమొంది, తోటకైన నేగియుండునని తలఁచి మిన్నకుండెను. వసంతసింహుని హృదయము పరాభవానలదందహ్యమానమై

మగుచుండెను. అతఁడు తన కుమార్తె యెంతగా విచారించుచున్నాదు నో యని తలపోసికొని అతఁడు తనకుమార్తె మందిరమును సమీపించి, యామె వదనము నవలోకించెను. ఆమె వదనము చింతాక్రాంతమై యుండుటకు మారుగా నానందవికసితమై యుండెను. అతఁడు తన తనూజను సమీపించి, "అమ్మా! గడచినరాత్రి నిన్నా వికృతరూపుని పాల్జేసి, కనుపుఁ చిచ్చుపెట్టుకొంటి"ననెను. ఆమె "తండ్రీ! అదియంతయు రాజుగారాడించిన కపటనాటకమట గాదా? రాత్రి నేనా విలాంగుని మఱి చూడనేలేదు. అతఁడెందరిగెనో తెలియదు. ఒక సుందరాకారుఁడగు యువకుఁడే నన్ను వరిణయ మాడినాఁడు" అనెను.

ఆమె పలుకులాతని కత్యాశ్చర్యము గొలిపెను "అమ్మా! నీవు చెప్పునది నిజముగునా?" యని ప్రశ్నింప, నావిజయకుమారి బిరబిర తన గదిలోనికి కరిగి యొక తలపాగను దెచ్చిచూపెను. వసంతసింహుఁడా తలపాగను బరిశీలించి "ఇది మగధదేశపు నేఁత. ఆహా! ఎంతసుందరముగ నున్న"దని, యాతలపాగను విప్పి చూడగా నందొక వ్రాత ప్రతి కనఁబడియెను. ఆవ్రాతప్రతిని వసంతసింహుఁడు చదివెను. అందు జయదేవుఁడు తాను మగధరాజ్యమున వివాహముఁజేసికొనిన తేదీయు, నాతని కుమారుఁడు వీరసింహుఁ డనియు మొదలుగాగల యంశములెన్నో వ్రాయఁబడియుండెను.

ఆవ్రాతప్రతిఁజూచి వసంతసింహుఁ డానందమును బట్టజాలక మూర్ఛితుండయ్యెను. విజయకుమారియు నామెతల్లియు నాతనికి శైత్యోపచారము లొనర్చిరి. వసంతసింహుఁడు స్మృతినిఁగొల్చి వారిం జూచి "విజయకుమారా! నాసోదరుని కుమారుఁడగు వీరసింహుఁడే నిన్ను పెండ్లియాడినాఁడు. నాసోదరుఁడగు జయదేవుఁడో నీవిధంబు

మును గాంచినయే జగడమువచ్చినది. తుదకు నా మేనల్లుడే నిన్ను పరిణయమగుట యానందదాయకము. అతఁడేడీ?" యనెను. ఎచ్చటి కో వెళ్ళియుండుననియుఁ గతిపయదినములలో దప్పకతిరిగివచ్చుననియు సమాధానపడి వసంతసింహుఁడు వెంటనే యవ్విషయమును జయచంద్రమహారాజు కెఱింగించెను.

విజయకుమారి గర్భవతియై లోకోత్తరసౌందర్యవిభాసితుఁడగు నొకపుత్రునిఁగాంచెను. అతనికి జయసింహుఁడని నామకరణము జేయబడెను. జయసింహుఁడు శుక్లపక్షసుధాంశుబింబము వలెదినదిన ప్రవర్ధమానుఁడగుచుండెను. ఒకనాఁడాతఁడు బాలురతో నాటలాడుచుండగా నొకబాలుఁడు నీతండ్రియెవరని జయసింహుని ప్రశ్నించెను. అతఁడు "వసంతసింహుఁ"డనెను. ఆబాలుఁడు నవ్వుచు "వసంతసింహుఁడు నీతాత నీతండ్రి రాక్షసుఁ"డనెను. జయసింహుఁడు విచారాంబుధినిమగ్నుండై రోదించుచు దల్లికడకరుదెంచి, "అమ్మా! నాతండ్రి ఎవరో చెప్పుము. నన్ను నాస్నేహితు లందఱు గేలిసేయుచున్నా" రనెను

ఆమె యీవిషయమును దండ్రి కెఱింగించెను. అతఁడు కుమార్తె దుఃఖమున కుపశమనము గలిగింపనెంచి, మహారాజుతోఁ జెప్పి పరివార సమేతముగ నల్లుని యన్వేషింప బయలుదేఱి మగధ దేశమును జేరెను. మగధలో నాతఁడు వీరకేతు మహారాజు నంతఃపురమునకుఁ జని, తన సోదరి యగు జయదేవుని సతిమణి చిత్రాంగి నిం జూచి, పుత్రవియోగదుఃఖమునఁ బొగులుచున్న యామె నూఱడించి, తన కుమార్తె విజయకుమారిని బెండ్లియాడిన వీరసింహుఁ నెట్లైన వెదకి రప్పించెదననియు, నంతపఱకుఁ దన కోడలగు విజయకుమారిని, మనుమఁడగు జయసింహుని జూచుచు సూఱటఁ బొంద

నగు ననియు, నామె తనతోఁ గోసలదేశమున కరుదెంచి కొన్నాళ్ళుండుట యుక్తమనియు వచింప, నామె యందు కంగీకరించి, వీరకేతు మహారాజుతోఁ జెప్పి పయనమయ్యెను.

వసంతసింహుఁడు కొలఁదిదినములు ప్రయాణముచేసి, మార్గమధ్యమున నున్న విదర్భదేశమున ముఖ్యపట్టణమగు కుండిననగరమున నాగి, యారాజుచే యాహ్వానింపఁబడి గౌరవింపఁబడెను. విదర్భ నరేంద్రుఁడు వీరికొఱకు ప్రత్యేకమందిరము నేర్పఱచెను. ఆనాఁటి సాయంత్రము నౌకరగు వీరమల్లు జయసింహుని యంగడి వీధి చూపించుటకుఁ దీసికొని వెళ్ళెను. ఆబాలుని సౌందర్యాతిశయమును కనుగొని యెల్లరు వర్ణనాతీతమగు యానందము ననుభవించి, "ఆహా! ఆబాలుని గన్న తలిదండ్రులు నిక్కముగా ధన్యు" లని తలంచుచుండిరి.

వీరసింహుఁడు తన్నాదరించిన మిఠాయియంగడి యజమాని మరణించుటచే తానే భక్ష్యముల దయారుచేయుచు వానిని విక్రయించుచు గాలముగడపుచుండెను. అతఁడు పలుపర్యాయములు తన దురదృష్టమును నిందించుకొనుచుండెను. అతఁడు తయారుచేసిన మిఠాయి యత్యధిక రుచికరముగ నుండుటచే నానగరములోని వారెల్లరు నామిఠాయి కొనుచుండిరి. మార్గమునఁబోవుచున్న జయసింహుఁడు వీరసింహు నాకర్షించెను. వీరసింహుఁ డాబాలునిఁబిలిచి తనయంగడిలోనికి గొంపోయి వీరమల్లుని బ్రతిమాలి రుచ్యములగు మిఠాయినిదది తరభక్ష్యములను భుజింపజేసి యాకుమారుని బుజ్జగించి యాతఁడొక రాజకుమారుండని తెలిసికొనెను.

మూఁడవనాఁడు మరల జయసింహుఁడు పురమున విహరింప బయలుదేరి వీరసింహుని యంగడికరుదెంచి యాతనికోరికపై భక్ష్యము

ఆ గడుపారమునకు బసకు వెడలిపోయిరి. బసకుబోయినంతనే దిరాంగి రావుదయారు చేసిన మిఠాయిని బెట్టబోవ జయసింహుడు "వలదు. నేనిపుడే బజారున నొక యంగడిలో దిని వచ్చితి"న నెను.

"ఆగర్భశ్రీమంతుండవై మహారాజు మనుమండవైయుండి సామాన్యునివలె నొకయంగడిలో మిఠాయిదినుట యత్యక్షితకలిగించు"నని రాణి కోపగించెను. "సరే ఒకలడ్డునిమ్ము"ని జయసింహుడుతిని "ఆతఁడు చేసిన మిఠాయికున్నరుచి దీనికిలేదమ్మా"యని పలికెను. ఆమె "వాడు మారుఁడగు వీరసింహుఁడు తక్క అదన్యులేరును చేయజాల"రనిపలికి వీరమల్లునిబంపి మఱిమొకయుండకు దెప్పించి భుజించి "అయ్యో!"యనుచు మూర్ఛితయయ్యెను.

వసంతసింహుఁ డీసమాచారము నాలకించి యాయంగడివాని కపాయము కలుగకుండ వాతనిని బంధించి తీసికొనిరండని కబురుపంపి "వదినా! నీకుమారుఁడు వచ్చినంతనే యాతనితో మాటాడరాదు. నేచెప్పినపిదపనే మాట్లాడనగు"నని పలికెను.

ఆభటులు వీరసింహుని యంగడికరుదెంచి యాయంగడిని చెల్లాచెదరుగావించి యాతనిం బంధించి వసంతసింహుని బసకడకు గొంపోయిరి. వసంతసింహుడు వీరసింహునిగాంచి "ఓయీ! నీవేనాయామిఠాయిదయారుచేసినది?"యని ప్రశ్నించెను.

"అవును నేనే."

"ఆమిఠాయి బాగుగాలేనందున నీకు మరణశిక్ష విధించితి. వంతవఱకు నీవు బంది"వని వసంతసింహుఁడుపలికి వెడలిపోయెను. విజయకుమారి తనపతి నానవాలుపట్టెను. చిత్రాంగికూడ తన తన

యుని గుఱుతించెను. ఇరువురకు వీరసింహుని బిలిచి పరిరంభణ మొనరించుకొనవలయునను కోరిక విశేషముగా బీడించుచున్నను వసంతసింహుని యాజ్ఞకు భిన్నముగా ప్రవర్తింపనొల్లక యూరకుండిరి. వీరసింహుఁడు ఖైదీగానుండెను. ఆనాఁడే వసంతసింహుఁడు విదర్భరాజుతో జెప్పి కోసలకు బయలుదేఱెను.

కతిపయదినములు పయనమొనరించి, వారు కోసలను జేరిరి. వసంతసింహుఁడు విజయకుమారిని బిలిచి "అమ్మాయీ! నీవివాహమునాఁటి రాత్రి శయ్యాగార మెట్లలంకరింపఁబడెనో యట్లే యలంకరింపుము" అనెను.

శయ్యాగారమట్లే యలంకరింపఁబడియెను. వీరసింహుఁ డా మందిరములోనికిఁ గొంపోఁబడెను. అతఁడా శయ్యాగారమును బరీక్షించెను. పూర్వపు సంగతులన్నియు జ్ఞప్తికి వచ్చెను. అతఁడు తానాశయ్యాగృహమును మునుపొకపరి చూచినట్లే యుండెను. అతఁడా యాగారములోని గదిలోఁ బ్రవేశించెను. అచ్చట విజయకుమారి హంసతూలికా తల్పముపై శయనించియుండెను. ఆమెను చూచి, వీరసింహుఁడు ప్రేయసీ! యనెను. ఆమె ప్రాణేశ్వరా యనెను. వీరసింహుఁడు "ఆహా! నిన్నుచూచి, ఎన్ని సంవత్సరములైన" దని, తన యాశ్చర్యమును వెల్లడించెను. వారిరువురును నంత నెప్పుడో జరిగిన విషయముల నన్నిఁటిని చెప్పుకొనిరి. అతఁడు తన కుమారుని జూచి, నిరతిశయానందము నొందెను. ఆనాఁటి రాత్రి యాతఁడు సరిగా నిద్రింపనే లేదు. అతఁడు విభ్రాంతచిత్తుఁడై యుండెను.

ఉదయము కాఁగానే యాతఁడు తలుపు తెఱచునప్పటికి వసంతసింహుఁడు కనిపించెను. వీరసింహుఁ డాతనిం జూచి "[illegible]

వాడు మరణశిక్ష విధించిన?" దనెను. వీరసింహుఁడు తనకు రాక్షసు, లెట్లు విజయకుమారిని పెండ్లి చేసికొనుటలో సహాయముఁ జేసెనో తెలిపెను. వసంతసింహుఁడు తా నాతనిని బాధించినటుల కపటనాట కము ప్రదర్శించి వందులకు కోపింపవలదని ప్రార్థించెను. వీరసిం హుఁడు తన జననియగు చిత్రాంగితో డానొనరించిన కార్యముల నన్నిటిని బూసగుచ్చినట్లు చెప్పగా, నామె విని యాశ్చర్యమును బొందెను.

వీరసింహుఁడు తనతల్లిని, సతినిఁ దోడ్కొని మగధరాజ్యమున కరిగెను. వీరకేతు మహారాజాతనికిఁ బట్టాభిషేక మహోత్సవ మొన రించెను. ఆతఁడు ప్రజానురంజకముగ రాజ్యపరిపాలనముఁ జేయఁ దొడఁగెను.

ఇట్లు చెప్పగా నర్జునుఁడు "కృష్ణా! మహదానందదాయకమగు కథ చెప్పితివి. అర్ధరాత్రము మించినదింక నిద్రింతమని యట్లే యా యిసుకతిన్నపై మేనువాల్చిరి. నిద్రాదేవత వారినిఁ దన మృదుకర ములతో జోఁదొట్టెను.

పదకొండవకథ సమాప్తము.



## పండ్రెండవ కథ.

---

గోపీవల్లభుఁడగు వాసుదేవుఁడును, ఫల్గునుండును, సరససల్లాపములాడుకొనుచు యమునాసైకతస్థలముల నొండొరుల భుజములపై జేతులువైచుకొని విహరించుచు నదీతరంగములనుండి యల్లనల్లనజను దెంచు పిల్లగాలులసోకి మనమును రంజిలజేయుకొటి నేదేని పుణ్యచారిత్రమును జెప్పి నన్ను ధన్యునిజేయువే"యన వాఁడు "పార్థా! నేఁడు నీకు తుదికథను దెల్పుచున్నానని యిట్లు చెప్పఁగడగెను,

# విజయపాలమహారాజు కథ.



పూర్వము మాల్యవంతమనునగరమున విజయపాలుఁడను రాజకుమారుఁడుండెను. ఆతని తండ్రియగు జ్ఞానపాలమహారాజు తనరాజ్యముపై శత్రువులు దండెత్తివచ్చినందున వారితో సంగ్రామమొనరించి యారణమునం దసువులఁ గోల్పోయెను. ఆతనితల్లి దేవాంబ యగ్నిప్రవేశమొనరించెను. ఆరాజేంద్రునింట పరిచారికగానున్న లక్ష్మణాంబయను నామె విజయపాలునిబెంచి పెద్దవానిగజేసెను. ఆతఁడు బాల్యమునుండియు సాహసకార్యాచరణము నాసక్తిగలిగియుండెను. ఆతడు పదునెనిమిదివత్సరములప్రాయము ప్రాప్తించునరికి బలవంతుడును ధైర్యశాలియు నయ్యెను. దాది యీతనిని శత్రువులు చంపకుండ రహస్యముగ చాలధనమును, ఆభరణములను దెచ్చియుంచెను. ఆతఁడు పందొమ్మిదిసంవత్సరముల వయస్సుగలిగియున్నప్పుడు తనయొద్దనున్న ధనము నాతనికిచ్చి మరణించెను.

అంతటినుండి విజయపాలుఁడా ధనము ననవత్సరముగా వెచ్చించుచు, స్నేహితులకు ధనము నొసంగుచు కాలము గడపెను. అతని కడనున్న ధనమంతయు వ్యయమకాఁపిదప, నతఁడు జరిగినదానికిఁ బశ్చాత్తాపమునొంది, తనయొద్ద మిగిలియున్న యాభరణముల విక్రయించి, వాణిజ్యమొనర్ప నెంచెను అతఁడు కొందఱు వర్తకులతోఁ గలిసి సామగ్రిం గొని సముద్రయానముఁ జేయ బోయెను. అతఁడు పోనెంచిన సౌరాష్ట్రదేశమున కోడపై పదమూఁడువేల మైళ్ళదూరము పయన మొనర్పవలసియుండెను. ఆవిజయపాలుఁడు సముద్రపుగాలి కలవడక పోవుటచే నాతఁడు ప్రథమమున వ్యాధిపీడితుం డయ్యెను. కొలఁది దినముల కాతఁడారోగ్య వంతుఁడాయెను. అది మొదలుగ నాతని కెన్నఁడును జబ్బుచేయ లేదు.

విజయపాలుఁడు తక్కుంగలవారును చాలదినములు ప్రయాణ మొనరించి, యనేక నగరములను సందర్శించి, ఆయానగరములవారికి దమ సామగ్రిని విక్రయించి, వారివద్ద తమదేశంబున లభిపని సామగ్రిం గొనుచు, తుదకొక దీవిని సమీపించిరి. ఆదీవి యంతయుఁ బచ్చని పచ్చికతో నిండిన విశాల మైదానమువలెఁ గన్పట్టుచుండెను.

వర్తకులలో గొందఱి కాదీవిని యందలి విచిత్రములగు మొక్కలను జూచుటకై కుతూహలముదయించెను. ఓడయొక్క యధికారి లంగరువేయించి కొకనావగా నందఱుదిగి యాదీవిలోనికిఁబోయిరి, విజయపాలుఁడు తానొంటరిగ జాలదూరమరిగి యొకచోఁ గూర్చుండెను. ఇంతలో నాదీవికంపించెను. ఆవణిజులంత నయ్యది దీవికాదనియు తిమింగిలముయొక్కపై భాగమనియు గ్రహించి భయకంపితగాత్రులై రయమున నోడ నెక్కి బయలుదేఱిరి. ఆలోచనామగ్నుఁడైయున్న విజయపాలుఁ డిది గమనింపలేదు మఱియొకసారి యాదీవికంపించి

నట్లు కాఁగా నాతఁ డాశ్చర్యచకితుఁడై లేచి చూచునరికి ఓడ చాల దూరమేగియుండెను. అతడు వర్ణనాతీతమగు భీతికిలోనయ్యెను.

ఆ తిమింగిలమింతలో మునిగిపోయెను. విజయపాలుఁడు ధైర్యము వహించి యెట్టులో ఈదుకొనుచు నొకదిన మాయలలపైగడపెను. ఎట్టకేల్లో ఆ యలల యాఘాతమున నాతఁడు తీరమునుజేరెను. తీరమును జేరిన విజయపాలుండు తొలినాఁడు భోజనము లేకుండుటచే నీరసముగనుండి జీవచ్ఛవమువలెబడియుండెను. అతనిపై బాలభానుని యరుణకిరణములు ప్రసరింపగనే యొకవిధమగు నావేశము కలిగెను.

విజయపాలుఁడు బయలుదేఱి, కొంతదూర మేగగా నొక మహావృక్షము కనంబడెను. ఆవృక్షశాఖలపై మిగులముగ్గియున్న ఫలములు కమ్మనివాసనల సద్దిసల నెగఁజిమ్ముచుండెను. ఆ మామిడి పండ్లను గొన్నింటిని దిని యాతఁడు తన యాకఁటిమంటను జల్లార్చుకొనియెను. అతఁడు మఱికొంత దవ్వేగ నొక సుందరశ్వేతాశ్వము కనబడెను. అతఁడా హయమును సమీపించెను. ఒకఁడరుదెంచి, విజయపాలుని “మీరెవ?”రని ప్రశ్నించెను. అతఁడు తన వృత్తాంతము చెప్పెను.

ఆహయమును దెచ్చిన పురుషుఁడు తాను ఐరావతీదేశపు రాజు కొలువులో నుంటిననియు, ప్రతివత్సరము తమ రాజునకుఁ జెందిన యశ్వముల నటకుఁ దీసికొని వచ్చుచుందుమనియు సముద్రమునుండి యొక యుత్తమాశ్వమీవలికివచ్చి, యాతయాఁడుగుఱ్ఱములోఁ గూడి వెళ్ళిననియు, తదనంతరమా హయము మాయశ్వమును [illegible]

సించుననియు నంత మేము చప్పటలు జఱచి, సంరంభముఁ జేయఁగా నయ్యది పాఱిపోవుననియు నుడివెను.

అతఁడు చెప్పినట్లే సముద్రమునుండి యొకగుఱ్ఱ మీవలికేతెంచి. యాయశ్వముతోఁ బోర్లి దానిని చంపఁబోగా, వారు తఱిమిరి. అతఁడు విజయపాలునిఁ దనతోఁ దీసికొని యొక సొరఁగమార్గమున గొంతదూరముఁ దీసికొనిపోయి, తినుబండారముల నిచ్చి, తమనగరములోనికి దీసికొనిపోయెను. అదియొక ద్వీపము, ఆకల్యాణి ద్వీపమున నెన్నో వెలగల ముత్యములు లభించుచుండును

ఆవర్తకస్థలమున నతఁడొకనాఁడు సముద్రతీరమునకుఁ బోయెను. ఆయోడలోని సామగ్రులన్నియు క్రిందికి దింపబడెను. విజయపాలుని సామగ్రికూడ నటనుండెను. అతఁ డాయోడయధికారిని దనతోడి వర్తకులనుగలిసికొని తానా తిమింగిలమునుండి మునిఁగిపోయినదాదిగ నప్పటివఱకును జరిగిన చరిత్రములఁ జెప్పి తన సామగ్రినిదీసికొని యా"కల్యాణి"లోని వర్తకులకు విక్రయించి కొన్నిటి నాద్వీపమునేలు రాజునకు బహుమానముగ నొసంగెను. విజయపాలుఁడు మఱల నా యోడనెక్కి మాల్యవంతనగరముం జేరెను. అతఁడు తానార్జించిన విత్తముతో నొకదివ్యమగు హర్మ్యము నిర్మించెను. ఒకరాజపుత్రిని వివాహముజేసికొని యందు నిరతిశయానందభరితహృదయుఁడై కాలముగడపసాగెను.

కొలదిమాసములు గడచిన విజయపాలుఁడు మఱల బయలుదేఱ దలంచెను. అతఁడు కొంతమంది వర్తకులతోఁగలిసి మఱల యోడ మీఁద బయలుదేఱెను. ఈప్రయాణసందర్భమున వారు సందర్శించిన ప్రతినగరములోనుగూడ నపరిమితమగు లాభముకలిగెను.

ఇట్లుండగా వారొకనాఁడు వారిందిదివి యను నొకదీవిం జేరిరి. వర్తకులందఱును మోడనుగట్టివైచి యాదీవిలోనికరిగిరి. విజయపాలుఁడు తక్కుంగల వారికంటె నొకింత దవ్వేగి యొకమహోన్నతవృక్షచ్ఛాయ నాసీనుఁడై యాహారముం భుజించి నిద్రించెను. అతఁడు గాఢనిద్రాపరవశుఁడై యుండెను. అతఁడు చాలసేపు నిద్రించి మేల్కాంచి తీరమున కరుగునరికోడ దృష్టిపథమునుండి దాటిపోయెను. విజయపాలుఁడు చింతాంబుధిమునింగెను. ఆతనిహృదయమున నపుడెన్నో విచారభావము లుదయించెను. ఆతనిస్థితికడుంగడు దుర్భరముగనుండెను. నిర్మానుష్యమగు నాదీవియం దాతని కేతెఱువును గాన్పింపలేదు ఆతఁడు బిగ్గరగా రోధించెను. ఆతని రోదన మరణ్యరోదనమాయెను. ఆతఁడు చాలదూరముపోయి తెల్లని ఱాతినొకదానిం జూచెను. అతఁడాశిలపై నుపవిష్టుండై తన మార్గాయాసము నపనయించుకొనుచుండెను. సూర్యభగవానుం డపరాంబుధింగ్రుంకెను. ఇంతలో నాప్రదేశమంతయు గాఢాంధకారబంధురంబాయెను. ఇట్లాకస్మికముగ నిచ్చోటెల్ల తమోమయంబగుట కేమిహేతువోయని విజయపాలుఁడు శోధించెను. గొప్పపక్షియొకటి గగనమండలమునుండి క్రిందికిదిగుచుండెను. విజయపాలుం డంత దాను గూర్చుండిన శిల యాపక్షియొక్క గ్రుడ్డని గ్రహించి యొకవృక్షము డాఁగియుండెను.

ఆపక్షితో నెచ్చటికి బోయినను సరియేయని విజయపాలుఁడు తన యుత్తరీయమును వృక్షశాఖనలెనున్న యాపక్షి పాదమునకుఁ గట్టుకొనెను. ఆవిహంగము తన గ్రుడ్డును పొదిగి యాకసంబున కెగిరిపోయెను. విజయపాలుఁడుకూడా నాపక్షితో నెగిరిపోయెను. అతని కనులు గిరగిర తిరుగుచుండెను. ఆపక్షియొక పర్వతాగ్రముం జేరెను. ఆపర్వతముపై నాపక్షివ్రాలగనే విజయపాలుఁడు తన యుత్తరీయ

ములను విర్చుకొనెను. ఆశక్తి యంలేనొక కూ్రరసర్పమును నోటఁ గఱచుకొని వెడలిపోయెను.

విజయపాలుండా పర్వతాగ్రభాగమున నట నుండెకొంత సేపటిని కెట్టిలాభమును గలుగలేదు. ఆపర్వత మేటవాలుగనుండెను. దానిప్రక్క నెన్నో పర్వతములుండెను. అతఁడు మెల్లగా నాపర్వతముల మధ్యనున్న లోయను జేరెను. ఆలోయలో నెన్నోవిధములగు వజ్రములు, కెంపులు, వైడూర్యములు ధగద్ధగాయమానముగఁ బ్రకాశించుచుండెను. చండకరుని కిరణకాంతి యందా రత్నములు తళతళమని మెరయుచుండెను. అతనికెంతో విస్మయం బొదవెను. అతని హృదయ మానందసాగరతరంగముల నోలలాడెను.

ఆనంతో షమెల్ల క్షణకాలముననే యంతరించెను. అతని కొంత దూరమున కూ్రరసర్పము లెన్నోయుండెను. అతఁడా వజ్రములఁ బరిశీలించుచు కాలముఁ గడపెను. రాత్రియయ్యెను.

విజయపాలుఁ డొకగృహలో బ్రవేశించి యారాత్రిగడపెను. అతనికి నిదురకలుగనేలేదు. అతనిప్రక్క నొకమాంసఖండము బడెను. ఎన్నోమాంసఖండములాలోయలోబడెను. పక్షులన్నియు నామాంస ఖండముల గఱచుకొని పోయెను. అవి వజ్రములలోయ. వర్తకులా లోయలో మాంసఖండముల విసరుదురు. వజ్రములా మాంసఖండముల కంటుకొనును. అవి యాఖండములను దమవృక్షములలోని కులాయంబులకుఁ గొనిపోయినపు డావణిజు లాపక్షుల బెదరగొట్టి యావజ్రముల నేరుకొనిపోవుచుందురు.

విజయపాలుడు తన వస్త్రములో నెన్నోవజ్రములమూటఁగట్టుకొని మెల్లగా యాపర్వతాగ్రముంజేరి యటనున్న వర్తకులనుగలిసి

కొనెను. అతఁడు వారి కొక్కకవజ్రమునొసంగి వారితో 'జలంధర' మను నగరమున కరిగి యట దనవజ్రములలోఁ బెక్కింటి నపారలాభ మునకు విక్రయించి తనకు మాల్యవాతనగరముఁజేరి సుఖముగ గా లముగడపసాగెను.

మాదుమానసములు గడచెను. అతనికింటియొద్ద నేపనియులేక నిరుత్సాహముగనుండుటచే నేమియు దోఁచకుండెను. విజయపాలుఁడు మరల గొందఱు వర్తకులతోఁగలిసి వర్తకముచేయు దలంపుతో రక రకముల సామగ్రితో నోడనెక్కి బయలుదేఱెను. వారు వివిధనగర ముల దర్శించుచు తమసామగ్రిని లాభమునకు విక్రయించుకొనుచు బ్రయాణము చేయుచుండగా 'మిహిర'యను దీవిని సమీపించిరి.

ఆదీవిలో దిగుటకు ఓడయధికారి కిష్టము లేకున్నను, తుపా నగుటచే విధిలేక దిగవలసి వచ్చెను. ఆదీవి సమీపించినంతనే యాట వికు లెందఱో యాదీవికే తెంచిరి. వారి కరములం దీఁటెలుండెను. వారందఱు నరుదెంచి, వీరిని వధింతుమని బెదరించి, తమ దీవిలోనికిఁ గొంపోయిరి. వారందఱు నొకభవనములోఁ బ్రవేశపెట్టఁబడిరి. ఆభవ నావరణమున మనోహరవర్ణ విరాజితములగు ఫలవృక్షములుండెను. విజయపాలాదులా భవనాభ్యంతరమునఁ జొచ్చిరి. అచ్చట యొక మం టపమును దానిపై నెన్నియో దుర్గంధము వ్యాపింపఁజేయు ఎముకలు నస్థిపంజరము లుండెను. మఱొకవంక రుధిరముతోనిండిన పాత్రలుం డెను. మఱొకచోట మత్స్యములు గుట్టలుగుట్టలుగఁ బడియుండెను. వారందఱు తమగతియేమగునో యని భీతిలుచుండిరి. అందఱును నప్ర మేయప్రభావ భావనాతీతుండగు పరమాత్మని ధ్యానింపఁ గడం గిరి. అందఱును శిలావిగ్రహముల మాడ్కి యట్టె నిశ్చేష్టులై యుండిరి.

అహస్కరుఁడు పశ్చిమాచలము చాటునకరిగెను. శకుంత సంతానములు కిలకిలారావములఁ జేయుచుండెను. ఆటవికులు నృత్యములు సేయుచు నానందముగ కాలము గడపుచుండిరి. మంటపము వెనుక నున్న తలుపుం దెఱచుకొని యొక రాక్షసుండరుదెంచెను. విజయపాలుఁడును తక్కుంగలవారిలో నారక్కసునిఁజూచి, భయకంపితులైరి. అతఁడు తాటిచెట్టును మించిన పొడవు కలిగియుండెను. శరీరము నిండుగ రోమములుండెను. అతని ఫాలభాగమున నొక నేత్రముండెను. నాలుగు దీర్ఘములగు దంతములుండెను. అతఁడు కసాయివాఁడెట్లు గొఱ్ఱెను బైకెత్తునో యట్లే విజయపాలుని బైకెత్తెను. అతఁడు మాంసహీనుఁడై యుండుటచే రక్కసుఁడసంతుష్టిపూర్వకముగ విడవిడిచి, అందఱిలోను ఓడయధికారియే బలముగానున్నందున నాతనిం జంపి, యామాంసమును బచనముచేయించి, భుజించి మంటపముపై నిద్రించెను. వేఁకువనే లేచి, యారక్కసుఁడు వెడలి పోయెను.

విజయపాలుఁడు స్వప్రాణరక్షణార్థ మనేకోపాయముల నరయుచుండిరి. వారి విలాపములు హృదయవిదారకములుగ నుండెను. ఆభవనమెల్ల వారి రోదనధ్వనులచేఁ బ్రతిధ్వనించుచుండెను. వారా దీవిలో నెచటనైన దాఁగొనుట కనువైన ప్రదేశముండునేమో యని యన్వేషించి, నిష్ఫల మనోరథులై మరల భవనముం జొచ్చిరి. ఏకాక్షియగు నారాక్షసుఁడు మఱల నరుదెంచి, వారిలో నొకని భక్షించి, నిద్రించెను. ప్రత్యూషమున మేల్కాంచి, యాతఁడు వెడలి పోయెను.

అందఱును దలకొక యుపాయముం జెప్పుచుండిరి. ఒకఁడు సముద్రమున మునిఁగి మరణింత మనియెను. విజయపాలుఁడు సాహసవ

మునసున్న రొయుక మేకు సెరిగా కాల్చి, సాయంకాలమున నారక్క సుం డేతెంచినపుడు నిద్రించుచుండగా వాని కన్నులందా మేకు నుంచి, యంధునిగ నొనరించిరి. ఆకేడు భయంకరముగ పెనుబొబ్బ లిడుచు, దీర్ఘములగు తన కరములసాచి, వారిని బట్టుకొని వధింతు గాండ్రుగాండ్రుమని సింహమువలె గర్జించుచుండెను.

విజయపాలుడు వారినందఱిని దీసికొని సముద్రమునకుం బోయి యారాత్రినచట నే బరుండిరి. ఉదయమున నారక్కసుం డిరువురు మిత్రులను వెంటనిడుకొని తీరమున కరుదెంచెను. అచటనున్న కలప దూలములను నావలుగా నుపయోగింపనెంచి సముద్రమునకుంచిరి. ఎందఱో యాటవికులారక్కసుని యనుసరించియుండిరి. విజయపాలుం డును మిగిలినవారును నాకలపదూలములనెక్కి సముద్రమున ద్రోసి వేసిరి. వారిపై రక్కసులు రాళ్లురువ్వసాగిరి. ఒకపెద్దఱాయి తగిలి విజయపాలుం డారోహించిన నాకలోని చివరభాగము విఱిగిపోయెను.

సముద్రతరంగములమధ్య నిటునటు నూగుచు నాచిన్ననావలు రెండుదినములకొకదీవిని జేరెను. అందఱు నాదీవిలోనికి బోయిరి. ఆ దీవియం దనేక ఫలవృక్షములుండెను. వారందఱు మధురాఫలముల నారగించిరి. ఇంతలో నెచటినుండియో నొకభయంకరమగు భుజంగ మరుదెంచి విజయపాలునితోనున్న వారిలో నొకనింగఱచెను. ఆయు త్తరక్షణముననే యాతఁడు 'హా' యని కెవ్వున కేకవైచి మరణించె ను. ఆసర్పమెటకో పాఱిపోయెను. విజయపాలుడును మఱియిర్వురును మాత్రమే యుండిరి. ఆముప్వురును నొకవృక్షముపై గూర్చుండిరి. ఇంతలో రాత్రియయ్యెను. పాముమఱల నరుదెంచి నామిత్రునొకనిం గఱచెను. ఆతఁడు క్రిందపడి మరణించెను. మఱుచటియుదయమున సర్పము మఱల నరుదెంచి యాతనింగఱచెను. విజయపాలుఁడు తెల్ల

వాఁడునంతదనుక ప్రాణములరచేతఁబట్టుకొని యుండెను. అతఁ డుదయమున సముద్రతీరమునకుఁ బయిగొత్తుకొనిపోయెను. దూరమున నొకయోడ దృగ్గోచరమయ్యెను. అతఁడు బిగ్గరగా కేకలిడుచు జేబురుమాలును విసరెను. ఆఓడయధికారి యదిచూచి కరుణాయత్తచిత్తుండై యొకచిన్నవావ నాతని రక్షణార్థము పంపెను. విజయపాలుం డాయోడనెక్కి బయలుదేఱెను. ఆయోడలోనివారు ధూళిధూసరితవస్త్రములుం దాల్చియున్న విజయపాలునికి నూత్నవస్త్రముల నొసంగెను.

ఆయోడ కొన్ని దినంబులకు సాలద్వీపముం జేరెను. ఓడ యధికారి విజయపాలునిం బిలిచి "సోదరా! పాపమొక వర్తకుండు, విజయపాలుండను వాఁడొక దీవియందు నిద్రాముద్రితుండై యుండఁగా మేము మఱచి పోయి వెడలిపోయితిమి. అతని సామగ్రి నీ దీవిలోని వారికి విక్రయించి, యిటులభించు రక్తచందనముం" గొనుమన, విజయపాలుఁడు తాను ద్వితీయ నౌకాయాన మొనరించినదా యోడయేయని గ్రహించి, "ఓమిత్రుఁడా! ఆవిజయపాలుఁడను నేనే"యనెను. అధికారి యాతనిం గుఱుతించి, యానందాతిరేకంబున పరిరంభణ మొనరించుకొని యాతని సామగ్రి నాతని కొసంగెను. తన సామగ్రిని జాగరూకతతో భద్రపఱచినందులకు విజయపాలుఁ డాతని కనేక కృతజ్ఞతాపూర్వక వందనముల సమర్పించెను. పిమ్మట వారందఱు ననేక నగరముల సందర్శించుచు మాల్యవంత నగరమును జేరి, బీదలకు నన్నవస్త్రదానములఁ జేసి, సౌఖ్యజీవనము గడపసాగెను.

ఆఱుమాసములు గడచెను. విజయపాలుఁడు తాను గత ప్రయాణము లందనుభవించిన కష్టముల నన్నింటిని మఱచెను. నూతనము లగు వింతలం గనుఁగొనవలయునని మఱల వణిజులతోఁ గలసి బయలు

దేఱను. కొంత దూరము చనినంతనే తుపాను ఆరంభమై, ప్రయాణము దుస్సాధ్యంబయ్యెను. ఓడ మునిఁగిపోయెను. చాలమంది ప్రయాణికులు తమ ప్రాణములఁ గోల్పోయిరి. ఆ ఓడ యొక్క తెరచాప తెగిపోయెను. విజయపాలుఁడును మఱికొందఱును నొక చిన్న నావ నెక్కి సాయంతనమగునందాక పయన మొనరించి, యొక దీవిం జేరిరి. ఆ దీవిలోనికిఁ బోఁగా వారికిఁ గొన్ని గృహములు గోచరించెను. ఆదీవిలోని యాటవికులు విజయపాలుని దక్కంగల వారిని యొక మూలిక నాఘ్రాణించు మనిరి. అందఱు నాఘ్రాణించి, చైతన్యము గోల్పోయిరి. ఒక్క విజయపాలుఁడు రోగార్తునివలె నటించుచు వారిచే హింసింపఁ బడక యా దీవిలో స్వేచ్ఛగాఁ దిరుగుచుండెను. ఆయాటవికులు విజయపాలుని దక్క మిగత యైదుగురిని వధించి, వారిని భక్షించిరి.

విజయపాలుఁ డొకనాఁ డెట్లులైన యాదీవినుండి పాఱిపోవఁ గృతనిశ్చయుండై యుదయమున నందఱును వేఁటకుం బోయి యున్న తఱి తిన్నగా బయలుదేఱి, యటఁ గావలికాయుచున్నవాడు వలదని వారింప, నాతనిని శిక్షించి వెడలిపోయెను. విజయపాలుఁ డవ్విధమున నేడు దినములు నడచి ఎనిమిదవనాఁడు సముద్రతీరమును సమీపించెను. అచ్చట కొందఱు మిరియముల నేఱుచుండిరి. వారికి విజయపాలుఁడు తనయుదంతమును సాంతముగ నెఱింగించెను. వారు విజయపాలునియెడ దయగలవారై, యాతనిని దమరాజుకడకుఁ గొనిపోయిరి. ఆ రాజు సరళచిత్తుఁడు. విజయపాలు నాతఁడు మిక్కిలి యభిమానానురాగములతోఁ జూచుచుండెను. రాజుగారి యనుగ్రహంబునకుఁ బాత్రుఁడైన విజయపాలుండా నగరములోని యందఱిచేతను గౌరవింపఁబడసాగెను.

కొలఁది దినములిట్లు గడచెను. ఆరాజు విజయపాలుని యొక నాఁడు పిలిచి, "మిత్రమా! నీవు స్నేహపాత్రుఁడవు. నీకొక యువ కారముంజేసి, మన స్నేహపాశమును మఱింత దృఢమొనర్పవలయు నని, నేనాశించుచున్నాను. మనోహరమూర్తి యగు నాబంధుగు రాలి నీవు వివాహముఁ జేసికొని మఱికొన్ని మాసములిటఁ గడపు టయే నాయభిలాషంబని తెలుప, నాతఁడు రాజుగారి కోరిక నిరాక రింపఁజాలక యందులకుసమ్మతించెను.

విమల కమనీయవదనారవిందయగు నొకకన్య విజయపాలుని కిచ్చి పెండ్లిచేయఁబడెను.

ఇరువురు నానందముగ గొన్నాళ్ళుగడపిరి. విజయపాలుఁడు రహస్యముగానైన నాదేశమును వీడిపోవలయునని యెంచెను. ఇట్లుం డగా నాతని పొరుగింటివానిసతి మరణించెను. ఆరోదనధ్వని నాల కించి విజయపాలుం డాతని నూఱడించి "మిత్రుఁడా! ఈవిచార ముఖ శమించినపిదప మఱలఁ బెండ్లిచేసికొనవచ్చునుగదా"యనగా నాతఁడు "అయ్యా' ఈదేశాచారము మీకుఁ దెలియదు. భార్యమరణించినచో భర్తయు పతి మరణించినచో సతియుగూడ సహగమనము జేయుట వాడుకయైయున్న"దనగా విజయపాలుడు నిశ్చేష్టుఁడై "అహా! ఎంత క్రూరమగు నాచార"మని ముక్కుపై వ్రేలిడుకొనెను. విజయపాలుఁ డట నేమిజరుగునోయని కూర్చుండెను. ఇంతలో నాతనిబంధుగులు, మిత్రులు నరుదెంచి వాద్యవిశేషములతో నాసతిపతుల నొకవర్వతా గ్రమునకుఁ గొంపోయి యటనున్న సొరంగద్వారము నతనిసతి మృత కాయమును జాఱవిడిచిరి. తదనంతరము అతని నొకపెట్టెలోనుంచి కల ఘూరితమగు నొకఘటంబును నేఁడుదినములకు సరిపడు నాహార

మును నుంచి యాసారంగమున జారవిడిచి యాసారంగద్వారముపై నొక పెనుశిలనుంచి వెడలిపోయిరి. ఆవిషాదదృశ్యమునుగాంచి కన్నీరువిడిచినదొక్క విజయపాలుడే. విజయపాలుఁడా దేశపురాజునుసమీపించి తా నుదయమునగాంచిన దృశ్యము వినయమొప్పఁగించి "అయ్యా! విదేశవాసులకుగూడ నీయాచార మనువర్తించునా?" యని ప్రశ్నింప నారాజేంద్రుఁడు "విదేశవాసులైనను యీదేశపుయాచార మనుకరించు"ననియెను.

విజయపాలుని భార్య వ్యాధిగ్రస్త యయ్యెను. అతఁడు చాల భయపడెను. అతని భయమునకుఁ దగినట్లే యాతని సతి కొన్నిదినములు రోగముచే బాధపడి మరణించెను. విజయపాలుని విచారమునకుఁ బారము లేకుండెను పెద్దమనుష్యు లందఱు నరుదెంచి యతని సతి మృతకళేబరము నలంకరించి, యాపర్వతాగ్రమునకుఁ గొనిపోయిరి. ఆసారంగములో నీమెయును బిదప విజయపాలుండును విడువఁబడిరి. విజయపాలుని హృదయము అవాచ్యమగు దుఃఖమునకు లోనయ్యెను. అతఁడు తన యాహారములో నాలుగు దినములు గడపెను. ఆహార మింక లేకుండుటచే నాతఁడు మఱల సారంగ ద్వారముకడ వేచియుండెను. ఒక పురుషుని మృతకళేబరమును, ఒక స్త్రీయు విడువబడిరి విజయపాలుండా స్త్రీయొక్క యాహారములోఁ గొంత భక్షించి, యాసారంగములో నేమియున్నదో పూర్తిగాఁ బరీక్షింప నిశ్చయించుకొని బయలుదేఱెను.

సారంగములో మృతకళేబరముల దుర్గంధము నాసికాపుటరి టుల భేదించుచుండెను. ఎట్లో యాయంధకారబంధురమైయున్న యాసారంగమున జాలదూరమరిగెను. అతని కర్ణపుటముల నముద్రతరంగ

ములఘోష వినంబడుచుండెను. అతఁడు తిన్నగా పోవఁగా నాకసము నందలి నక్షత్రములు మిలమిల మెఱయుచుండెను. ఆసారంగమునుండి, యువ్వలికేఁగుట కొక పెద్ద రంధ్రముండెను. ఆరంధ్రమునుండి యాతఁడు దాటి సముద్రతీరమును సమీపించెను. సముద్రమునకును నగరమునకును మధ్య నాసారంగంబేర్పడి యున్నదని యాతఁడు గ్రహించెను. సముద్రతీరము నుండి నగరములోని కరుగుటకు వేఱొక మార్గము లేకుండెను. విజయపాలుఁడా రాత్రియంతయు నిద్రింపక గడపెను. అరుణోదయమయ్యెను. ఒకయోడ యాతనికి దృగ్గోచరమయ్యెను. విజయపాలుఁడు తన యుత్తరీయమును విసి, తీరమునకు రావలసినదని యాయోడలోని వారికి సంజ్ఞ యొనర్చెను. ఆసంజ్ఞ నోడలోనివారు గమనించి, కనికరించి యొక నావను బంపిరి. విజయపాలుఁడా నావనెక్కి యోడనుజేరెను. విజయపాలుఁడా సారంగములోని యాభరణముల నన్నింటిని దీసి వేచియుండెను. విజయపాలుఁడు వారితో కాలదీవి, గంటలదీవి మొదలగు దీవులను సందర్శించి, మాల్యవంతముఁ జేరి, యిక నెన్నఁడును నోడప్రయాణము జేయనని యొట్టుపెట్టుకొనెను.

విజయపాలుఁడట్లు నిశ్చయించుకొనెనే గాని, యింటికడ నుండుటచే నేమియుఁ దోచదాయెను. అతఁడు మఱలఁ బ్రయాణము చేయ నెంచెను. ఇదివఱకువలె నాతఁ డితరుల యోడలోఁ బయనించు టేటికని తన స్వోపయోగమునకై యొక యోడను గొనెను. అనేకమంది వర్తకులు విజయపాలుని యోడ నారోహించిరి. వాయుసమీరుఁ డనుకూలుండై యుండుటచే విజయపాలాదుల ప్రయాణము కరమనుకూలమై యుండెను. వారందఱుఁ గొన్ని దినములు పయనము నొనరించి నిర్మానుష్యమగు నొక దీవిఁ జేరిరి.

ఆ దీవిలోనికిఁ బోఁగా వారి కొక పెద్దగ్రద్ద కన్పించెను. అయ్యది తానిదివఱ కొక పర్యాయముఁ జూచినటువంటిదే యని, యాతఁడు వారికిఁ దెల్పెను. వారా గ్రద్దను భక్షింపఁ దలంచి రాళ్ళతో నద్దానిం బ్రద్దలుఁ గొట్టఁ బోయిరి. విజయపాలుఁడు వలదని యా వణిజులను వారించినను వారు వినకుండుట నాతఁ డూరకుండెను. ఇంతలో నాకసమునుండి రెండు పెద్ద మేఘములు క్రిందకు దిగుచున్నట్లు తోఁచెను. విజయపాలుఁడు వానిని చూచి, ఆహా! మోసము వాటిల్లినది. ఆపక్షులు రెంటను క్రిందకు దిగుచున్న" వనియెను. అందఱు నోడ నెక్కిరి.

ఓడ బయలు దేఱెను. పక్షులు తమ గ్రద్ద బ్రద్దలై పోయి యుండుట చూచి మఱల నింగి కెగిరి పోయెను. అవి పెద్ద పెద్ద ఱాళ్ళను దీసికొని వచ్చి యా యోడపై గిరవాటు వేయగా ఓడ తుత్తునియలై పోయెను. అందఱును దమకు లభించిన కొయ్య ముక్కలను బట్టుకొని, ప్రాణముల రక్షించుకొనుచుండిరి. విజయపాలుం డొక యోడచెక్కను బట్టుకొనియెను. ఆతఁ డొక దినమట్లు తరంగముల మధ్య నూఁగులాడుచు, నొక దీవిం బ్రవేశించెను. ఆ దీవి యత్యంత రమణీయముగా నుండెను. దానిలోని కాతఁ డరుగ నొక ఋష్యాశ్రమము గోచరించెను. ఆతఁడా ఋషి పాదముల కొఱఁగి, "అయ్యా! నా ప్రయాణము లన్నింటియందును కష్టములే సంభవించుచున్నవి. నా యాత్మ పరిణతియందు సాధనమును, నా కిట్టి కష్టములును రాకుండు నుపాయమును నెఱిఁగింపు" మని ప్రార్థించిన, నా జ్ఞానశీల మహర్షి యిట్లు చెప్పసాగెను.

"వత్సా! తృష్ణయను నది యంతములేనిది. ఈ యాశ మానవుఁడు సంసారపాశములందుఁ దగుల్కొని యున్నంత కాలమును

నుందును. నేను దీవులను పరిపాలించు రాజు మహోత్కృష్ట దీవిని గోరు చుండును. ఈ నైహిక సౌఖ్యమును త్యజించిన గాని, మానవుని యాత్మ పరిపక్వము నొందదు. ఈ సంసారమే కల్ల. అట్లు కల్లయని ఎఱింగినవాఁడే నిజమగు సన్యాసియై మోక్షగామియగుచున్నాఁడు. ఈసంసారము కేవలము నసత్యమని గ్రహించినవాఁడే ముక్తిలోకము కొఱకు సన్నద్ధుం డగుచున్నాఁడు. తలిదండ్రులు తమ బిడ్డల యాటపాటలు నిజమని తలంతురా? బిడ్డలు పూపొదరిండ్లు కట్టుకొని, బొమ్మలకు పెండ్లిండ్లుచేయుదురది తలిదండ్రులు సత్యమని తలంతురా? అట్లే సన్యాసులు దాంపత్య మసత్యమని నుడువుదురు. చిత్తనము వలన నెట్లు చెట్టు ఏర్పాటగునో శరీరమునకును, దెలివికిని నట్టిసంబంధమే కలదు. బ్రహ్మమున కిట్టి మార్పులు లేవు అది ఎప్పుడు నొకేరీతినుండును. మఱియు మన జీవితము, మన ప్రవర్తనముకూడ నీటిపై బుడగవంటిదే. ఇదే కొన్ని దినములవఱకు గనిపించి, పిదప శూన్యమగుచున్నది. పుట్టుటకు ముందును, మరణించిన వెనుకను మనము లేనేలేము. దీనినే శూన్యమని, మాయయని, తెలివియని, ఎఱుకయాయని, స్వప్నమని తెలుపుదురు. బ్రహ్మమునకు నిరాకారమని, బట్టబయలను, పరమపదమని పర్యాయపదములుకూడ గలవు. ఈమాయచేష్టలు లేనివాఁడే నిజదేవుండనబడును.

విజయపాలుండు చిత్తమును శాంతియుతముగ నొనరించుకొని, యాదీవిలోనికి మఱికొంతదూరమరుగ రమ్యమగు నుద్యానవనము కనంబడెను. ఆయుద్యానవన మధ్యస్థంబగు కాసారతీరంబున విజయపాలున కొక శతవృద్ధుఁడు గోచరించెను. అతఁడు విజయపాలునిం బిలిచి “నాయనా! నడవలేను. నన్నాతీరమునకుఁ గొంపొమ్మనెను. ఓహో పెద్దవాఁడుకదాయని విజయపాలుఁ డాదుల కంగీకరించెను.

అతఁడా వృద్ధుని సమీపింపఁగనే యతఁడు కొట్టుచు, బాధింపసాగి నందున విజయపాలుఁడు కోపపరీతచిత్తుఁడై, యటనుండి విజయపాలుఁడు శీఘ్రగమనమున దీరమునకుఁబోవును. అతని యదృష్టవశమున నచట నొక యోడయుండెను. అతఁడు తన వృత్తాంతము నా యోడవారి కెఱింగింప వారతనిం దీసికొని వెళ్ళుట కంగీకరించెను. వారు "మహేంద్ర" దీవిం జేరిరి. అచ్చట కొబ్బరకాయలు విశేషముగ దొరకును. విజయపాలుఁడు మిగిలిన వర్తకులందఱితోను బోయి, యాదీవిలోని చెట్లపైనున్న కోతులపై రాళ్ళు రువ్వసాగెను. ఆకోతులు వారిపైఁ గొబ్బరకాయలు విసరసాగెను. ఆకాయల నేరికొని వారు మరల నోడనెక్కిరి. అచట దొరకు ముత్యములను విజయపాలుఁడు భద్రపరచెను.

కొలఁది దినములు పయనమొనరించి, విజయపాలుఁడు మాల్యవంతముం జేరెను. తాను దెచ్చిన ముత్యముల నాతఁడు విక్రయించి, యాలాభములోఁ గొంత బీదల యన్నవస్త్రదానములకు వ్యయపరచెను.

విజయపాలుం డొక్క సంవత్సరము పఱకును మఱల నిలువీడలేదు. అతనికి సముద్రయాన మొనర్చి, ధనార్జన మొనరించుటయు, వింతలం గాంచుటకుఁ గూడ కుతూహలముండెను. అతఁడును, పెక్కుమంది వణిజులును గలిసి యొక యోడ నెక్కి బయలు దేఱిరి. వారు చాలదినములు పయన మొనరించి, ఒకనాఁడు సముద్రమధ్యమున మార్గముఁ దప్పితిమని గ్రహించిరి. కాని మఱల వారికి సరియైన మార్గము కనబడినందున నానందముతో మఱలఁ బయనము సాగించిరి. ఓడ యధికారి యింతలో గుండెలు బాదుకొనుచు వచ్చి "అయ్యో

లారా! ఓడ మహాపాయకరమైన స్థితిలోనున్నది. ఈప్రవాహ వేగమున నోడ తిన్నగా యొకపర్వతమునకుఁ గొట్టుకొని తుత్తునియలై పోగలదు. అన్యోపాయములేదనెను. అందఱును దమ ప్రాణములపై నాసవీడి పరమాత్ముని దలంచుచు కూర్చుండిరి. ఓడ యాప్రవాహమున శరవేగముగఁ బోయి, పర్వతమునకుఁ దగిలి భగ్నమయ్యెను. విజయపాలుఁడు, ఓడ యధికారి మఱికొందఱు మాత్రమే సజీవులై యుండిరి. వారివద్ద గొంత యాహారసామగ్రికూడ నుండెను. ఓడ యధికారి, వారి నుద్దేశించి "మిత్రులారా! మన కింక మరణము తథ్యము. ఇచ్చట కాలాభంగమైన వారెవరును సజీవులై యుండలేదు. మన మింక నిచటినుండి పోవుదారిలే" దనియెను.

విజయపాలాదులు కన్నులశ్రుపూరితములుకాఁగా, నొకరి నొకరాలింగన మొనరించుకొని విలపించిరి. వారివద్దనున్న యాహార సామగ్రితోఁ గొన్నిదినములు గడపిరి. ఆపర్వతము ధగద్ధగాయమాన ముగ బ్రకాశించు వజ్రములతోను రత్నములతోను నిండియుండెను. కాని యేమిలాభము?

ఒక్కొక్కఁడే క్రమముగా నాకటిబాధకుఁ దాళఁజాలక మరణింపసాగెను. ఇతరులకు దెలియకుండ విజయపాలుఁడు తనకడర హస్యముగ మఱికొంత యాహారము దాచుకొని యుండుటచే వారం దఱికంటె రెండుదినములు విశేషముగ జీవించెను. తుదకతని యా హారపదార్థములుకూడ నైపోయెను. విజయపాలుఁడు మరణమునకు సంసిద్ధుం డయ్యెను. అతఁ డొక గోతినిద్రవ్వుకొనెను. అతఁడు మిక్కిలి నీరసస్థితియందున్న బడియుండగ, భగవంతుఁడు "ఓయీ! నీకాయు ర్దాయమున్నపుడు జీవించుటకు ప్రయత్నింపక, నిస్పృహుండవై యేల

బాధపడెదు" వని హెచ్చరించి నటులయ్యెను. విజయపాలుఁడు పరమాత్ముఁడు తనయెడ కృపాయత్తచిత్తుఁడై యున్నందులకు మనంబున ధన్యవాదము లర్పించి, లేని శక్తిం దెచ్చుకొని, మొదట యాపర్వతమునందలి మణులను, వజ్రములను, రత్నములను యేఱి, యొకమూటగా కట్టెను ఓడ భగ్నమైనపు డాతఁడొక చిన్ననావనెక్కి తీరమును జేర్పియుండెను.

అతఁ డిపుడా నావనెక్కి, యామహోన్నత పర్వతశ్రేణి నంటి యున్న గుహను జొచ్చెను. నిబిడాంధకారబాధుకమగు నాగుహ యందు విజయపాలుని కేమియుఁ గాన్పింపలేదు. అతఁడు చాలతడవట్లు పయనమొనరించెను. నావ యాప్రవాహవేగమున నరుగుచుండగా విజయపాలుఁడు నిద్రాముద్రితుఁడయ్యెను. అతఁడెంతసేపట్లు నిద్రపోయెనోగాని లేచినపిదప కోయవారిమధ్య నుండెను. అతఁడది స్వప్నమో, సత్యమో గ్రహింపఁజాలకుండెను. అతఁడు వారి నుద్దేశించి "ఆర్తత్రాణపరాయణుండగు పరాత్పరుఁడు మిమ్ము రక్షించును మీకు శుభము కలుగఁజేయును." అనెను. ఆకోయవారిలో నొకండు విజయపాలు నుద్దేశించి, "సోదరా! భయపడకుము. నీనగలమూట యిదిగో" యని, యామూటనిచ్చి, "నీవొకప్రవాహవేగమునఁ బోవుచుండగా మాలో నొకడాలోకించి, నీవపాయస్థితి యందుంటివని గ్రహించి, యానావను దరిఁజేర్చెను.

విజయపాలుఁడు తనకాఁకలిబాధ మిక్కుటముగా నుండుటచే తనకుఁ గొన్ని ఫలముల నొసంగుమని కోరెను. వారిచ్చిన ఫలముల భుజించి విజయపాలుఁడు తన యుదంతమును బూర్తిగ వారికెఱింగించెను. వారు విజయపాలుని నొకయశ్వముపై నెక్కించి, తమ రాజుకడకుఁ గొంపోయిరి. అనరేంద్రునకు విజయపాలుఁడు

తన వృత్తాంతమును బూర్తిగ నెఱింగింప, నాత డాశ్చర్యాన్విత స్వాంతుఁడై విజయపాలుని చరిత్రమును సువర్ణాక్షరములతో నొక శిలపైఁ జెక్కించెను. విజయపాలుని దనకుఁ గొన్నాళ్ళతిథియై యుండవలెనని యారాజేంద్రుఁడు కోరెను. అతనికగు వ్యయమంతయు నా మహీపాలుండే భరించుచుండెను. విజయపాలుడు తనకడ రత్నములలోఁ గొన్నింటి నాతేఁకి కానుకగా నీయఁబోవ నాతఁడు తన నగరము నంటియున్న పర్వతములోని లోయను, యందు దేదీప్యమానముగా వెలుగొందు వజ్రములను జూపెను ఆవజ్రములలోఁ గొన్నింటిని రాజనుమతిమీాద విజయపాలుఁడు తీసికొనెను.

విజయపాలుఁడు తన దేశమునకుఁ బోవలయునని రాజును సెలవిమ్మనెను. అనర్ఘములగు రత్నములను బహుమానముగా నొసంగి, యారాజు మాల్యవంతము నప్పుడేలుచుండిన జయపాలునకు గానుకగా నిమ్మని కొన్ని బహుమానములను నొక యుత్తరమును నిచ్చెను, ఆరాజుచే నియమింపఁబడిన యొక యోడమీాఁద నాతఁడు ప్రయాణముచేసి మాల్యవంతనగరముం జేరి, నిజగృహంబున కరిగి సుస్నాతుండై మంచివస్త్రముల ధరించి, జయపాలమహారాజును వీక్షింపఁబోయెను. ఆమహారాజు విజయపాలుఁడొసంగిన లేఖను ముందుఁ జదువుకొనెను. అందిటులుండెను.

"శతసహస్రరత్న విరాజమాన దివ్యహర్మ్యాది సాధుఁడును, శతకుంజరములు కలవాడును సింధూరదేశమున కధిపతియునగు మానసింహమహారాజు శ్రీ శ్రీ శ్రీ మాల్యవంత దేశాధిపుండగు జయపాల మహారాజుగారికి వ్రాయునది.

"మిత్రమా! ఈబహుమానములు మిక్కిలి విలువగలవియు నంత గొప్పవియు గాక పోయినను మన మైత్రికి చిహ్నముగానక

ముసు. ఇంకటినుండి మీరును మేమును సోదరభావములో మెలఁగుటకై కోరుచున్నాము."

అని యుండెను. ఆరాజేంద్రుఁ డంతట నాబహుమానములఁ బరీక్షించెను. మొదటి బహుమానము నల్వంకలను ముత్యము లమర్చబడిన యొక రత్నము. ఆరత్న మత్యద్భుతకాంతులను వెలిజిమ్ము చుండెను. రెండవ బహుమాన మొక రక్షరేకు. అయ్యది సువర్ణ నిర్మితమై రత్నఖచితమైయుండెను. అయ్యది సర్పాకారములో నొప్పుచుండెను. దానిని ధరించిన వారి కెల్ల కార్యములందును శుభ మొనవ్పును. తృతీయబహుమానము జగదేక రంభయనం దగిన సుందరీమణి.

జయపాలనరేంద్రుఁడా బహూకృతుల నన్నింటినిగాంచి, యానంద భరితాత్ముండయ్యెను. ఆరాజు తనకుమార్తెయగు లావణ్యప్రభను బిలిచి యాకాంతను దన చెలిమికత్తెగా భావింపుమని చెప్పెను. లావణ్యప్రభ యొంటగా విజయపాలుఁడా మానసింహమహారాజు రాజ్యములోని వింతల నన్నింటిని దెలిపెను. నవయౌవనవతియు నవివాహితయు నగు లావణ్యప్రభ విజయపాలుని సౌందర్యవిలాసముల నాలోకించి పరవశయయ్యెను. ఆమె యాతని వచోమధురామృతమును గ్రోలెను. మధురభవము లామె చిత్తమున నుత్పత్తిల్లెను. జయపాలుఁడు విజయపాలుని బహూకరించి వీడ్కొలిపెను. అతఁడు రాజకుమారి లావణ్యమును రూపురేఖావిలాసములను దలఁచుకొనుచు, నానందమయభావనా ప్రపంచమున స్వేచ్ఛావిహార మొనరించుచు నింటికేఁ బోయెను. రాజకుమారి లావణ్యప్రభ హృదయము మాత్రము ప్రేమానల తప్తము కాసాగెను.

ఇటులుండగా నొకనాఁడు జయపాలుఁడు విజయపాలునకుఁ గబురంపి "విజయపాలా! నీవు వెంటనే సింధూరదేశమున కరిగి, మహా

రాజా మానసింహునకు నే నొసంగు బహుమానము నొసంగి రావలయు" ననెను.

విజయపాలుని శిరముపైఁ బిడుగు పడినట్లయ్యెను. గడచిన యాఱు ప్రయాణములందును దా ననుభవించిన కష్టము లొక్కసారిగా వాని హృదయఫలకమునఁ బ్రతిఫలించెను. అతఁడు గద్గదస్వరముతో "ప్రభూ! గడచిన యాఱు ప్రయాణములందును నేననుభవించిన కష్టములు శరీరమును గ్రుంగఁ దీసినవి. క్షమింపవలయు" ననెను. ఆ రాజేంద్రుఁడు, విజయపాలా! ఏమైనను నీకిది తప్పదు. ఆఱు ప్రయాణములందును కష్టము లనుభవించిన మాట వాస్తవంబైనను, ననేక రాజ్యములను గ్రయమునకుఁ దీసికోఁజాలు నంతటి ధనము నార్జించి నావు సాహసుఁడవగు రాజపుత్త్రుఁడవు" అనియెను.

మహారాజుమాట కాదనజాలక, విజయపాలుఁడు సమ్మతించెను. విలువగల రత్నహారములను నొకలేఖయు నిచ్చుటయేగాక విజయపాలుని ప్రయాణమునకుఁ బ్రత్యేకముగ నొకయోడను నియమించెను. అతఁడు మహారాజు సెలవుగైకొని వచ్చుచుండగా నుద్యానవనమునఁ బూలుకోయుచున్న లావణ్యప్రభ విజయపాలునిజూచి పరుగున వచ్చెను. అతఁడామెపై ప్రణయవిహ్వలములగు దృష్టులఁ బఱపెను. ఆమెకా విజయపాలునితో సంభాషింపఁ గోర్కెయున్నను సిగ్గుపెంపున మాటాడజాలదయ్యెను. అతఁడామె నట్లే పదిబదిగఁ జూచుచు వెడలిపోయెను. మదనుఁడామెను దన పుష్పశరములచే మిక్కిలి గాసిఁ జెందించెను.

విజయపాలుఁ డోడనెక్కి కొలఁదిదినములు ప్రయాణమొన రించి సింధూరదేశముం చేరెను. విజయపాలుఁడు మహారాజగు మాన

సింహుని సందర్శించెను. ఆరాజు "విజయపాలా! నీరాక నాకత్యధిక మోదంబు నొనఁగూర్చినది. నీసౌజన్యము, సౌహార్ద్రము నెంతయుఁ బ్రశంసింపఁ దగిన"వని యొను. ఆతఁడు తెచ్చిన లేఖను జదివి, యాబహుమానము స్వీకరించి, యానందభరితాత్ముఁడై విజయపాలుని కనేక వదనము లొసంగి పిల్పించెను

విజయపాలుఁడు తిరిగి వచ్చుచుండఁగా, దొంగలొకతెగవారై నడచెంచి, యాతనిని, పరివారమును గూడ దూరమునకున్న మంగళవతియను దీవికిఁ గొంపోయిరి. ఆచోరుల నాయకుఁడు విజయపాలుని దనయనుచరునిగ నియమించి, యొకనాఁడు సాంద్రాటవికిఁ గొనిపోయి, యేనుగుల వధింపుమని విల్లమ్ముల నిచ్చెను. ఒకయేనుగును వధించినంతనే యాదొంగలనాయకుండరుదెంచి, యాసామజము యొక్క దంతములఁ దీసికొని, భద్రము చేయుచుండెను. విజయపాలుఁ డవ్విధమున రెండు మాసములు కుంజరములఁ జంపసాగెను.

విజయపాలుఁడొక వృక్షముపైఁ గూర్చుండుట విలోకించిన యేనుగులన్నియు నొకనాఁడాతఁడు తన వృక్షముచుట్టును నిలువఁబడెను. ఆతఁడవి తన్ను వధించునేమో యని భీతిం జెందెను. ఒక దంతావళము రయమునం జనుదెంచి, యాతండున్న మహీజమును దన తొండము సాహాయ్యమున నూడఁబెఱికి, శీఘ్రగమనమున బోయి పోయి యొకచోట నించి, యావనాభ్యంతరమున కరిగెను. ఆతఁడవి తన్ను నిలిపినచోట నెన్నో దంతములు గుట్టలుగుట్టలుగా పడియుండుట కనుంగొని, యాయేనుగుల బుద్ధికుశలతకెంతయు నచ్చెరువందెను. ఆతఁడు తమ్ము క్రమముగాచంపి, దంతములను గైకొనుచుండుట గమనించిన యాగజములు దంతములున్నప్రదేశము నాతనికిఁ జూపెను విజయపాలుఁడు తిన్నగా చోరనాయకుని గృహమునకుఁ బోయెను.

అదొంగలనాయకుఁ డాతనిం గాంచి "ఎచ్చటికేఁగితివి? నీ వొంటరివై యీ రణ్యమంతయు నన్వేషించి విఫల మనోరథుండనై యాఁకలిచే బాధ బడితివని తలంచి మిక్కిలి విచారించి యుంటి కరుదెంచితివి" ననెను.

విజయపాలుఁడు తాను గాంచిన దంతయు నాదొంగల నాయకుని కెఱింగించెను. ఆనాయకుఁడును వారలును మఱుదినము నాగుట్టకరిగి, యచ్చటనున్న దంతములన్నింటిని దెచ్చికొనిరి. ఆచోరుఁడు విజయపాలుని సాహసమునకు మెచ్చి, "అయ్యా! నీవు లేనిచో నీదంతములు లభించియే యుండవు. నీవు స్వేచ్ఛగా నీదంతములలో సగముఁ గొని పొమ్ము. నీకుఁ గొంత ధనము నిచ్చెద" నని పలికెను.

ఒకనాఁడా ద్వీపమునకు ఓడ వచ్చెను. విజయపాలుఁడు దంతములఁ గొని, యనేక నగరములు సంచరించి, వానిలోఁ జాలవఱకు విక్రయించి కోటి రూకల నార్జించి, మాల్యవంత నగరముం జేరెను. మహారాజునకు రెండు దంతముల నాతఁడు కానుకగా నొసంగెను. ఆతఁడు సింధూరదేశమున కరిగియున్నతఱి జయపాలుఁడు వ్యాధిగ్రస్తుఁడగుట తటస్థించెను. ఆతఁడు తాను మరణింతునేమోయని భీతిఁజెంది కుమార్తెయగు లావణ్యప్రభకు వివాహము చేయఁదలంచి వివిధదేశాధీశుల చిత్రపటములను దెప్పించి చూపెను. విజయపాలు నామె మనసారఁ బ్రేమించియుండుటచే నారాజపుత్రులలో నెవ్వరును దనకు నచ్చరే" దని నిష్కర్షగాఁ జెప్పెను. ఆమె యెవరిని వలచియున్నదో కనుఁగొనుమని జయపాలమహారాజు చెలికత్తెల కాజ్ఞాపించెను. ప్రేమానలతప్తయై యనుదినము విజయపాలు డెప్పు డరుదెంచునా తన కన్నుల కాతఁడు గాన్పించి యెన్నఁడు మను వొనరించునాయని యామె తపించిపోవుచుండెను. చిరకాలమునకు రాకపోవుటచే నాతనికేమైన యాపద సంభవించెనేమోయని తలంచి కంటికి మంటికి నేకధారగా నేడ్చుచుండెను. డోలాందోళితచిత్తయైయున్న యామెను చె

లికత్తెలు వివిధములనడిగి విజయపాలుని ప్రేమించియున్నదని తెలిసి కొని యవ్విషయమును మహారాజున కెఱింగించిరి.

మహారాజు మిక్కిలి సంతోషించెను. అతఁడు విజయపాలుని పిలిపించి "విజయపాలా! ఈరాజ్యమునీయది నాతండ్రి మాజనకునిలో భిన్నాభిప్రాయము కలిగిన కారణమున వైరమూని నిజసైన్యముతో దండెత్తివచ్చి యుద్ధమునకు దలపడెను. నేనుకూడ ఆసంగ్రామములో బాల్గొనియుంటిని. నాజనకుడు మహావీరునివలె బోరాడె. రణమున నిహతుఁడయ్యెను. నీకొఱకు మేము వెదకి యొకదాదివలన నటకో గొంపోబడితివని తెలిసికొని యూరకుంటిమి. నాకుమార్తె లావణ్యప్రభను నారాజ్యమును నీకిచ్చుచున్నాను"అనిపలికి వెంటనే వివాహ మహోత్సవమును జాటించెను.

విజయపాలుని యానందమున కవధిలేదు. లావణ్యప్రభావిజయపాలుర వివాహమహోత్సవము మహావైభవముగ జరిగెను. మాల్యవంతదేశమునకు విజయపాలుడు రాజయ్యెను. అతఁడు ప్రజానురంజకముగా రాజ్యము పాలించుచు కాలము గడపసాగెను. అతని ఆటు ప్రయాణములలోని విశేషములును సువర్ణాక్షరములలో బాలఱాతిపై జెక్కింపబడెను."

ఇట్లుచెప్పగావినిపార్థుఁడు "బావా! కృష్ణా! తెల్లవాఱినదిరమ్ము పోయి యమునానదీజలంబుల స్నానముచేసివత్తము. ఎంతదీర్ఘమగు కథచెప్పి నాకానందము కల్గించితివి. ఈపండ్రెండుకథలనువిని నిగూఢ వేదాంతరహస్యముల నెఱింగి కృతార్థుఁడనైతి"ననియెను.

పదమూఁడవనాఁడు కృష్ణార్జును లిరువురును స్నానాద్యనుష్ఠానంబుల నెఱవేర్చుకొని, భోజనమొనరించి, తాంబూల చర్వణము గావించి, మృగయావినోదార్థమై ఖాండవవనంబున కరిగి, యావనము నందలి సింహశార్దూలాది వన్యమృగంబులం దునుమాడుచు, మహా

న్నత వృక్షంబులను, నవసౌరభ సమంచితములగు పుష్పలతలను కన్గొనుచు, ప్రకృతిరామణీయకతను సంతసించుచుండ నగ్నిదేవుం డేతెంచి, "మహానుభావులారా! నామనవి నొకింత యాలకింపవలయును. పూర్వము శ్వేతపాలుండను మహారాజు యాగమొనరించిన సందర్భమున ఘృతధారయధికమగుటం జేసి నాకగ్నిమాంద్యమను వ్యాధి కలిగి దానివలన విశేషముగా బాధపడుచు విరించికడ కరిగి యా బాధ నివారణ మగు నుపాయం బెఱింగింపు" మని వేడుకొనగా, నాపితామహుండు దయార్ద్రహృదయుండై "వైశ్వానరా! నరనారాయణాంశయుం డుదయించిన కృష్ణార్జును లిరువురును నొకప్పుడు ఖాండవ వనంబునకు విహరింప నరుదెంతురు. వారిని ప్రార్థింపుము. నీయార్తి వారు తక్క అన్యులు వారింపజాల"రనియెను. మహాత్ములారా! మీ యిరువురు నరుదెంచి, యీవనంబు దహించినచో, నా వ్యాధి నిర్మూలమగు" నన, పార్థుండు "వైశ్వానరా! నే నొకండనే సాయుధుండనై యున్నాండను. వాసుదేవుండు నిరాయుధుండు అతండు సాయుధుండు కానియెడల ; నేనొక్కరుండ నాకార్యమునకుం బూనుకొనగల ధైర్యశాలిని కాను" అనెను.

అగ్నిహోత్రుడు "పావనులారా! వరుణునిందలంచి మీకొఱకు యీగంధర్వజవహయములను అక్షయబాణతూణీరములను సంపాదించి యుంచితి"నని చక్రమును గదయు కృష్ణునకును బాణతూణీరముల నర్జునునకును నొసంగెను.

వారంత "వైశ్వానరా! ఇంక నీవా వనంబున నగ్ని రగుల్కొలుపుము. ఎవరడ్డువచ్చినను మేము శిక్షించి యోడింతు"మనెను. అనలదేవుడు విజృంభించి యారణ్యంబున నగ్నిరగుల్కొలిపెను. అనిమిషులా యనలప్రభావము సైపజాలక దేవేంద్రునికడకరిగి మొఱ పెట్టుకొనిరి. శచీమనోనాథు డాగ్రహానలజ్వాలల వెడలగ్రక్కుచు

క్రోధోన్మత్తుండై యుద్ధమొనరించెను. ఇంద్రునకును కృష్ణార్జునులకును భయంకర సంగ్రామము సంప్రవర్తిల్లెను. ఇంద్రుడు ప్రయోగించిన వివిధ నారాచముల నావాసుదేవపార్థులు మార్గమధ్యముననే సంహరించుచుండిరి. వారిని జయించు టసాధ్యమని గ్రహించి సురగణ పరివృతుండై స్వర్గలోకనాథుండగు నమరేంద్రుడు దరుదెంచి కృష్ణార్జునులవలన గౌరవింపబడి వారి కాగ్నేయవారుణాది మహాస్త్రభావసంకలితములగు బాణముల నొసంగి సఖ్యమొనరించుకొని తనలోకంబునకుజనె.

అనలదేవుడు తన రోగమంతరించినందులకు వారి కనేక కృతజ్ఞతాపూర్వకాభివందనము లర్పించి దీవించి తిరోహితుండయ్యె. కృష్ణుండు "పార్థా! మనకొరకై నీయన్నలు వేచియుందురింక పోవలయు" ననెను.

ఇరువురును నింద్రప్రస్థమునకరిగిరి. ధర్మరాజు కృష్ణుని మరికొన్నాళ్ళతిథిగానుండగోరెను. వాసుదేవుడు మరికొన్ని దినములందే యుండి యనంతరము ద్వారకకరిగి బలరామసాత్యకులకును దేవకీవసుదేవులకును యింద్రప్రస్థవిశేషములదెలిపి సుఖముగా కాలముగడప సాగెను.

పంచేంద్రులకథ లను వచనకావ్యము

సమాప్తము.



శ్రీరామా ముద్రాక్షరశాల, రాజమండ్రి—1932.